# పీఠిక.

---

ఈగ్రంథము ముఖ్యముగా ధర్మస్థానములందు వాదించు వకీళ్లు మొదలగువారికి హిందూధర్మశాస్త్రవ్యవహారము క్రమముగా సుఖబోధమగుటకొఱకు రచియింపఁబడినది. ఇది నాతలంపని గ్రంథముచదువఁగా స్పష్టమగును - ఈసంగ్రహము మొదట ౧౮౫౬ సంవత్సరమందుఁ బ్రచురముచేయఁబడ్డది. నాతండ్రిసర్ తామసు స్ట్రెంజిగారిచే రచియింపఁబడి - ౧౮౨౫ సంవత్సరమందుఁ బ్రచురముచేయఁబడి సుప్రసిద్ధమైయుండు "ఎలిమెన్టస్ ఆప్ హిందూలా" యనెడిగ్రంథము దీనికిమూలము - సర్ తామసు స్ట్రెంజిగారు - తాముచూడ ననుకూలించిన శాస్త్రములన్నిటిని ధర్మస్థానములవారుగాని యాపండితులుగాని శాస్త్రములన్ని శోధించిచెప్పిన వచనములన్నిటిని, శోధించి చూచినదిగాక శాస్త్రపఠనము చేసినవారివలన సాధ్యమయినంతసాహాయ్యముఁబొందెను. అతఁడు దాను బూనుకొన్నవిషయ మదివఱకుఁ బూర్ణముగాఁ బరిశోధింపఁబడినది కాదని యెఱిఁగియితరులకుఁ దెలుపఁబూనుకొన్నవానికి సరియైన మార్గముదెలుప నెంతవలయునంత శ్రద్ధపుచ్చుకొనెను. అతఁడు చేసినయత్నములు సర్వసమ్మతములవుట నతనిగ్రంథము సర్వప్రదేశములందు మిక్కిలి ప్రామాణికమని యొప్పుకోఁబడియున్నది. నాఁటనుండి నేఁటివఱకు ముఖ్యముగా ధర్మస్థానములవారు జరిగిం

# హిందూధర్మశాస్త్రసంగ్రహము.

ఇంగిలీషుభాషయందు

చెన్నపట్టణమ్ము హైకోర్టుజడ్జిగారైన

తామస్ లంస్డన్ స్ట్రేంజిదొరగారిచేత

ర చిం పం బ డి న ది.

ఈగ్రంథము

ప ర వ స్తు - చి న్న య సూ రి చే త

న ర హ రి గో పా ల కృ ష్ణ మ సె ట్టి గా రి

సాహాయ్యమువలనఁ

తెనుగింపఁబడియె.

**THIRD EDITION.**





MADRAS:

PRINTED AT THE HINDU PRESS, BY C. V. KRISHNASAWMI PILLAI,

No. 13, ARMENIAN STREET.

1869.

చిన గ్రంథములచేత స్పష్టమయిన యంశములను అతనివలె నేకూర్చి యీగ్రంథము పెంచితిని.

శైలియందుఁగాని గ్రంథము నేర్పాటునందుఁగాని సర్ తామసు స్ట్రేంజీగారివలె యత్నింపలేదు. అతఁడు శాస్త్రమును వివరించుటయందు దానియర్థమును భావమును దేనిదేనికది యుపయోగించునో యాయాయంశమును, విచారించి యితరదేశములవారి ధర్మశాస్త్రములతోనుముఖ్యముగాఁ బ్రాచీనరోమక ధర్మశాస్త్రములతోను ఇంగ్లీషువారి ధర్మశాస్త్రములతోనుఁబోల్చి వానికిఁగల భేదాభేదములను వివరించి చెప్పుచువచ్చెను. అట్టికార్యముచక్కఁగా నొకమాటు చేసియుండఁగా మరలఁ జేయంబనిలేదు -ఆకాలమందు హిందూధర్మశాస్త్రమం దింగిలీషువారికి విశేషపరిచయములేదు - గనుక సర్ తామసు స్ట్రేంజిగారు వ్రాసిన వాదగ్రంథమువలన విశేషప్రయోజనము కలిగియుండెను. శాస్త్రహేతువులు తెలిసికోఁగోరినవారికి సర్వదాదానివలన నాప్రయోజనము కలుగుచుండునేకాని యొకప్పుడు వ్యర్థముకానేరదు. నేను వ్యవహారమునకు వలయునంశములుమాత్రము వ్రాయఁదలఁచి శాస్త్రము వ్యవహరించువారికొఱకు నానేర్పుకొలఁది యథార్థములయిన శాస్త్రోక్తులిట్టివనివ్రాసితిని.

ఇతరులమతము నాకుసమ్మతముగానిచోట నాకుఁదోఁచిన యభిప్రాయములనే తెలియఁజేసితిని. యథార్థముగాశాస్త్రముకాదని నమ్ముటకు హేతువులుండఁగా శాస్త్రమిదే

యని వ్రాసినపత్రమందు నా వ్రాఁత యథార్థమనిపించుకోనే రదు. ఎక్కడనైన నొకొక్కచోట నామతము సర్ తామసు స్ట్రేంజిగారిమతమునకును ధర్మస్థానములవారితీర్పులకును వేఱయినదికాక పండితులమతమునకును వేఱయినది. అట్లు భేదముకలిగినచోట దానికింగల హేతువులను సంగ్రహముగా నుదాహరించితిని.

మూలగ్రంథములే పరిశోధించి హిందూధర్మశాస్త్రమిట్టిదని కనినిశ్చయించుట యూరోపియను పూనుకోఁదగినదికాదు ఇప్పటి హిందువులకుసయితము దానినెఱవేర్పుట దుష్కరము. మూలగ్రంథముల కేర్పడియున్న ప్రాచీనవ్యాఖ్యానములను విచారింపఁగా బహువచనములకు వ్రాసియున్న యర్థమాధునికులబుద్ధికి విపరీతముగాఁ దోఁచుచున్నది. అయినను జిరకాలముగా సర్వసమ్మతములై సర్వదాయాచరింపఁబడుచుండు నావ్యాఖ్యానములు ప్రామాణికములైయున్నవి కాఁబట్టి వానినియథార్థములైనశాస్త్రార్థములనుగా గ్రహింపవచ్చును. అందుచేత బాధకలుగదుగాని యిప్పటివర్తమానము ననుసరించి మూలగ్రంథములకేయిప్పుడు వ్యాఖ్యానము చేసితిమా మిక్కిలి బాధయగును సందేహము లేదు. కాఁబట్టి యిట్టివిపరీతపద్ధతి ధర్మస్థానపండితులుపూని తమబుద్ధిచతురతచేత మూలగ్రంథమునకు నవీనమయిన యర్థముచెప్పి యిదివఱకు సర్వసమ్మతములైరూఢముగా నేర్పడియున్న నిబంధనలను సందిగ్ధార్థములనుజేసినట్లు నాకుఁదోఁచినచోటనే బహుతరముగాఁ బండితులయభిప్రాయములను ధర్మస్థానమం

ముఁగాని యీగ్రంథమందుఁగాని యంగీకరింపనైతి. పండి
తేతరులు బహుతరముగాఁ బ్రకృతమందాచారములేని నిబం
ధనలనే యిప్పటి నిబంధనలనుగాను బంగాళసంప్రదాయపు
నిబంధనలను గాశీసంప్రదాయపు నిబంధనలుగా భావించు
కొనుటచేత అన్యదేశీయుల (అనఁగా నింగిలీషువారి) యాచా
రమువలని బుద్ధిప్రమాదముచేతను బొరపాటుపడినట్టు నా
బుద్ధికిఁ దోఁచుచున్నది. అయిన నిట్లుకొన్ని సమయములందు
మాత్రమే భిన్నాభిప్రాయముకలిగినదికాఁబట్టి భేదింపఁదగి
నదిగాదు.

శాస్త్రముఖ్యార్థమునకుఁగాని దాని యాచారమునకుఁ
గాని భేదిల్లిన కార్యములుకొన్ని యిచట వివరించుట యుక్త
మని తోఁచుచున్నది. ఇదివఱకు శాస్త్రార్థము భేదిల్లునట్లు సం
భవించినపరకీయకారణము లిట్టివని తెలిసికొంటిమా యిఁక
మీఁద దానిభిన్నముచేయఁదగిన కార్యములు ప్రసక్తించినపు
డు జాగరూకముగానుండి యన్యాయముగాఁగాని హానికర
ముగాఁగాని యవిప్రబలకుండునట్లుచేయవచ్చును.

ఎట్లనఁగా హిందూధర్మశాస్త్రము లెవరికొఱకు మొదలఁ
గావింపఁబడినవో వారేకాక యితరులునయితము దానినా
చరించెదరు - ఈ రాజధానిక్రింది పశ్చిమతీరదేశమందు వ
సించుకొన్ని తెగలవారు మహమ్మదీయ మతముగలవారైన
నుఁ దమచుట్టువసించుచున్న హిందువులపద్ధతి దాయభాగ
క్రమములనే యనుసరించుచున్నారు. ఆప్రదేశమునకు నీ
రాజధానిక్రింది యితరదేశములకు నడుమఁ బడమటి కను

ముయనుకొండచా లోకటియున్నది కాఁబట్టి యక్కడి యా
చారములును వేఱైయున్నవి - ఆదినివచ్చి చేరిన మహమ్మదీ
యులుగాని మహమ్మదీయ మతావలంబులుగాని మొదట మి
క్కిలికొందఱై యక్కడక్కడ నొక్కరొక్కరుఁగాఁ జెదరి
యుండిరి కాఁబట్టి చుట్టుపట్ల నాచరింపఁబడుచున్న యాచార
ములను నిరోధింపలేక వానికిలోఁబడి యాచరించిరి. మఱియు
నీరాజధాని క్రింది సర్వదేశములందును హిందూవంశస్థులైన
క్రీస్తువులు సయితముదాయభాగవిషయము హిందూధర్మశా
స్త్రము నే యాచరించెదరు. వారికనుకూలింపఁదగిన యిత
రశాస్త్రములేనందునఁ దమచుట్టుపట్టునున్నవారి శాస్త్ర
ములే యనుసరించుట సహజమైయుండినది. మఱియు సన్మా
ర్గవిసర్జనము ఆచారభ్రంశము పెండ్లికానివారియందుఁ బు
ట్టుట మొదలయిన హేతువులచేత జాతిభ్రష్టులై శాస్త్రము
నకు వెలిపడిన హిందువులు క్రొత్తతెగలవారుగా నేర్పడిత
మమ నను కూలించినవఱకు హిందూ ధర్మశాస్త్రమునుదమ
కుఁ దామేయనుసరించుచున్నారు.

ముఖ్యముగా వివాహవిషయమందు స్వీకారవిషయమం
దును ప్రాచీన శాస్త్రాచారము తప్పిపోయియున్నది. ముందు
బ్రాహ్మణులుతమక్రిందికులముల కన్యకలను వివాహముఁజే
సికొనవచ్చును. అట్టి వివాహములవలన భాగములేర్పఱుచు
విషయమందును బిడ్డలవల్లగలుగు మతసంబంధిప్రయోజన
మును నిశ్చయించు విషయమందును భేదములుకలిగియున్న
ది. ఇప్పుడు బ్రాహ్మణులితరకులస్థులవలెనే తమజాతికన్యక

లను మాత్రము వివాహము చేసికొనవచ్చును. సగోత్రములోఁ దండ్రికి ముందరి యాఱుతరములవారి బిడ్డలను వివాహము చేసికొనఁగూడదని యేర్పడియుండు శాస్త్రము వాడుకకుఁ దప్పియున్నది. ఆ ప్రతిబంధము తల్లిదండ్రులు సహోదరులు బిడ్డలు ఇట్టివరుసలోనుండు వారివిషయములో మాత్రము చెల్లుచున్నది. స్వీకారమునకుఁ బండ్రెండు పద్ధతులు ముందేర్పడియుండెను. ఒక శిశువు శాస్త్రప్రకారము జనకపితసీఁ కర్తృపిత యీయిరువురి బిడ్డ కావచ్చునని నియమముండెను. ఔరసుఁడు లేని వారిప్పుడు స్వీకారము చేసికొనుటకు నొకపద్ధతి యాచారములోనున్నది. అనఁగాఁ గుమారుని స్వీకారము చేసికొనుట. ఇట్టి స్వీకృతుఁడు స్వీకరించిన తండ్రికే పుత్రుఁడుగానున్నాఁడు స్వీకార్యుని తల్లి న్యాయముగా స్వీకర్తను వివాహము చేసికొఁదగిన వావిగలదియైయుండవలెనను నిబంధన ద్రవిడదేశమందుఁ దప్పిపోయియున్నది గాన దౌహిత్రునిగాని భాగినేయునిగాని స్వీకారము చేసికొను వాడుక కలిగియున్నది.

స్వభావగుణములు కల్పితములయిన శాస్త్రీయనిరంకుశ సూక్ష్మతలను భేదింపను బూనుకొనినందున నీ భేదము కలిగియున్నదిగాన నది సుఖకరమని చెప్పవచ్చును. వాస్తవచరిత్ర మేరమీఱిన కాలమునకు మున్నె చిరకాలముగాఁ గలిగిన యాదిమశాస్త్రమునకింత కాలము కడచియు నిట్టియల్పభేదముఁ గలుగుట యాశ్చర్యముగానున్నది.

అయిననీ శాస్త్రము హిందూదేశము నితరభాగములలో

స్థిరము గానుండునట్లు బంగాళ దేశములోనుండలేదు. అచ్చ
టనీధర్మశాస్త్రనిబంధన యాచారమునకుఁ దఱుచుగామా
టి యిట్టిమార్పుప్రత్యక్షముగా నొప్పుకొబడియుండెడు సి
ద్ధాంతమువలన నేర్పడియున్నది. ఆసిద్ధాంతము పూర్ణము
గా ననుష్ఠానపర్యవసాయియయినయెడల నన్నిశాస్త్రములు
ను బ్రహతములగును. «ఒకయథార్థము నూఱు ప్రమాణము
లచేత నైనను మార్పఁబడదని" వారిప్రామాణికమైన దాయ
భాగములోఁజెప్పఁబడినది. అనఁగాఁ బ్రతిమనుష్యునికిస్వసౌ
ఖ్యమే శాస్త్రముగానుండవలసినది సరేకాని ప్రజలింతకలఁ
తకు మేకొనియుండలేదు. అయినను శాస్త్రమర్యాదలు సరి
గా నేర్పడనియెడల సంశయమును గలఁతయును గలుగవలసి
నది. ఇతరదేశములకంటె నధికముగా బంగాళదేశమునం
దు వ్యాఖ్యానకర్తలు కొందఱు కలిగియున్నారు. వారుతమ
తాత్పర్యములను శాస్త్రముయొక్క సరియయినయర్థము
గా నేర్పఱిచి శాస్త్రమును విబంధనకు లోపఱిచినారు. వట్టి
యభిప్రాయమునకే యిట్టియాధిక్యమిచ్చినప్పుడు తాత్పర్య
భేదములు విస్తారముగా నవశ్యముకలుగును. సర్ ఉల్లియమ్
జోన్సుగారి యనుమతిని జగన్నాథపండితులు రచియించిన
శాస్త్రసంగ్రహముచూడఁగా బంగాళశాస్త్రము వ్యాఖ్యా
తలచేత నిందితమయిన దశకుఁదేఁబడినదని స్పష్టముగాఁగా
నఁబడుచున్నది. అందుచేత హిందూశాస్త్రమందు మనస్సు
న నూహింపఁదగినయెట్టిసిద్ధాంతమునకుగాని యెంతపరస్పర
విరుద్ధమయినదానికిఁగాని యనుకూలముగా నొకప్రమాణ

వచనమును దానిసమర్థించుట కొకపండితుఁడును సిద్ధముగాలే గలరని యీశాస్త్రమునుపలుమాఱు తులకనగాదూషించె దరు. ఆనిందయజ్ఞానముచేతఁ జేసినదేకాని సరియయినది కాదు. అయిననిట్లుకలిగిన చెడ్డపేరు బహుతరముగాబంగా ళశాస్త్రమునకుఁ జెగునుగాని యితరమయిన హిందూధర్మ శాస్త్రమునకుఁ దగినదికాదు.

బ్రిటీషుదొరతనమువారికక్కడక్కడి యితరశాస్త్రము నువలెనె హిందూధర్మశాస్త్రమును సహితము సవరింపనధి కారము కలిగియున్నను వారు దానిజోలికంతగాఁ బోయిన వారుకారు. విగంతువులు వివాహముచేసికొనవచ్చునని సె లవిచ్చిరిగాని యదియభ్యసింపఁబడునని తోఁపలేదు. మత ము మొదలగునవి విడుచుటచేతఁగాని మఱిహేత్వంతరముచే తగాని జాతిభ్రష్టులయినవారు మృతప్రాయులుగనుక వారి కి దాయాధికారము లేదని హిందూధర్మశాస్త్రమందుఁ జె ప్పఁబడియున్నయంశమును బ్రిటిషుదొరతనమువారు నివా రించి వారికి దాయాధికారము యథాప్రకారము నిలుచున ట్లుచట్టము చేసిరి. మఱియుహిందూధర్మశాస్త్రమందు వివా దము తెచ్చుకోవలసినదానికయి యేర్పడియున్నకాలావధి ని ర్ణయమునిలిపి హిందువులు మొదలయిన యన్ని తెగలవారికి నొకకాలావధి శాసనమువిధించియున్నారు. ఈచట్టములన్ని చేయఁదగినవి.

మఱియుశాస్త్రపాలకులయిన ధర్మస్థానములవారి తీర్పు లచేతఁ గొంతభాగమువ్యవహారమందు భేదిల్లినది. కొన్ని యంశములుబో తిగామాఱినవి.

ఒక్కయంశమందు శాస్త్రము భేదింపక దానివ్యవహరింపవలసిన పద్ధతి[illegible]ఱినది. యెట్లనఁగా హిందూకుటుంబము సంసృష్టముగా నుండుటసహజము. కుటుంబమునకుఁ బెద్ద యైనవాఁడుసముదాయకార్యములువిచారించుచుఁగుటుంబమందుఁజేరిన యెల్లరకు వలయుప్రయోజనములు చేయుచున్నాఁడు. అట్లుండినను గుటుంబములోని వాఁడెవ్వఁడుగాని యాస్తియందుఁదనకు రావలసినభాగము ప్రత్యేకముగా నిప్పింపవలసినదని యడిగిపుచ్చుకొని ప్రత్యేకించి కుటుంబము వారితోజోలిలేక తనకుఁదాను స్వతంత్రముగా వర్తింపవచ్చును. ఈప్రకారము నిస్సందేహముగా ధర్మశాస్త్రమేర్పడియున్నది. అయినను బ్రిటిషుదొరతనమువారు రాకముందుఁగుటుంబమందుఁ జిన్నవాఁడయినవాఁడు స్వచ్ఛందాధికారమును వహింపయత్నించినదియరుదు. అపుడుజనులచేతఁ బెద్దవాఁడనిపించుకొనుటఁకు దెగువచేసి లజ్జయుడిగిన వాఁడుతప్ప మఱియెవఁడును దననొకపద్ధతిని విచారించువాఁడుగనుక తండ్రివంటివాఁడయిన కుటుంబముపెద్దను దనభాగమిమ్మని యడుగఁడు. మిక్కిలియావశ్యకత కలిగినపక్షమందుమాత్ర మీప్రకారము సాధారణముగా నడుగుటకలదు. కుటుంబాధిపతి యాస్తిపాడు చేయుచున్నపుడుగాని కుటుంబసముదాయద్రవ్యము మెండయినపుడుగాని విభాగాధికారము మిక్కిలియుపయోగించుచున్నదిగాని కుటుంబమువారియందఱి మేలువిచారింపక స్వతంత్రముగానుండవలెనను కోరికమాత్రాననిరాటంకముగా మనసువచ్చినట్టు దాయ

ముపంచుకొనినపక్షమందుఁ గీడుసంభవించును. ఇట్టికీడు బ్రిటిషుదొరతనమువారు స్థాపించిన ధర్మస్థానములచేత మిక్కిలిగాఁగలిగినది. కుటుంబాధికారివలనభాగము పొందవలెనని హిందూరాజులతోఁ జెప్పుకొనయత్నించినపుడు కలుగుచున్న ప్రతిబంధకములు బ్రిటిషుధర్మస్థానములకు వచ్చువారికిఁ గలుగుటలేదు. తక్కినవారిమేలువిచారింపక శాస్త్రోక్తముగా వానికిరావలసిన దాయము వానికిప్పించుటచేత వాఁడు స్వప్రయోజనమిట్టిదని పలుమాఱు ధర్మస్థానములవారివలన నేర్చుకోసాగెను. ఇపుడు తానురాకనే వకీలుచేతవివాదము జరిగింపవచ్చును. వానికినయభయములు చెప్పువారులేరు. ధర్మస్థానములవారు తక్కినయంశములు విచారింపక శాస్త్రమందుఁ జెప్పియున్నదన్నమాత్రానఁ దీర్పుచేసెదరు. అంతటఁ గుటుంబము వేఱుపడిచెదరిపోవుచున్నది. యిట్లుజరుగుటమంచిదికాదు. ఇపుడీప్రకారము ప్రతిదినము జరుగుచున్నదికాఁబట్టి యైకమత్యము లేకపోయినది - తగవులు మెండైనవి - లేమిపొసఁగినది. మళయాళదేశమందు మాత్రము శాస్త్రమిట్టిదికాదు. అక్కడభాగస్థులందఱు సమ్మతించిమఱి భాగించుకోవలసినదిగాని న్యాయస్థలములందు వివాదించి పంచుకోఁగూడదు. కాఁబట్టియిప్పుడాదేశమందుఁ బురాతనములయిన కుటుంబములును విస్తీర్ణములయి యవిభక్తములయిన స్థావరద్రవ్యములును గలిగియున్నవి. ఈరాజధాని, క్రింది యితరదేశమందు దానికి సాక్షాద్విరుద్ధముగాఁ బిత్రార్జితముమరలమరలమేరలేక విభక్తమగుటచేతఁ బరస్ప

రవిరోధమును వారి ద్రవ్యమును వానివలన బహువిధములయిన బాధలును గలుగుచున్నవి. కన్నడదేశమందుమాత్ర మెచ్చుకుందుగా మళమాళ సంప్రదాయము చెల్లుచున్నది.

ఈ ప్రకారము శాస్త్రమును దుర్మార్గముగా వ్యవహరించుటకు శాస్త్రమందే యవకాశము కలిగియుండినను దానికిఁ బ్రతీకారముఁ గలుగఁజేయుట దుష్కరముగాదు. ధర్మశాస్త్రప్రకారము వ్యవహారముజరిగించుటకు మన మేర్పఱిచిన ధర్మస్థానపద్ధతి దానినిక్రమముగాఁబాలించుటకుయోగ్యము కాదని యేర్పడినందున దానికిఁదగిన మేరయేర్పఱుచుట న్యాయ్యమైయుండును. అయిననిందు నిమిత్తము శాస్త్రమును మార్పనక్కఱలేదు. కుటుంబాధికారి సముదాయద్రవ్యము పాడుచేయుచున్నాఁడని కాని ద్రోహముచేయుచున్నాఁడని కాని యేర్పడిన పక్షమందుఁదప్ప ధర్మస్థానములవారు భాగమునకుఁదీర్పుచేయఁగూడదని యేర్పాటుచేయవచ్చును. ఇట్టి నిబంధనయివుడు సయితము ధర్మశాస్త్రమందు బాలకులదాయభాగప్రకరణమందుఁజెప్పియున్నది. ఆనిబంధనయేయెల్లవారికుపయోగింపఁ జేయవలసినయక్కఱ ప్రత్యక్షముగాఁ గానఁబడుచుండఁగా నట్లుచేయుట యన్యాయ్యముకాదు.

ఇట్లుజనులు తమశాస్త్రమును దుర్మార్గముగా వినియోగింపఁజేసికొనిదానికి శాస్త్రపాలకులను నిందింపవలసినదిలేదుగాని కొన్నియంశములందు శాస్త్రముపాలింపవలసినవారు తమయధికారము దుర్మార్గముగా వినియోగింపఁజేసినదానినతిక్రమించిరనుటకు సందియము లేదు.

హిందువులయిండ్లకుఁ జెల్లుబడికలుగఁజేయుట యెట్టి యక్రమము. ఇంగిలీషువారికిఁ గలిగియున్నట్టి యాయధికారము హిందువులకు శాస్త్రమందుఁ గలుగఁజేసియుండలేదు. వారికాయధికార మెంతమాత్రము కూడదని నిషేధించియున్నది. ఆనిషేధము యుక్తముగానే యున్నది. మొదటమనవారు ధర్మశాస్త్రము చక్కఁగాఁ దెలిసికొనకపోవుటచేత నీపొరపాటుపడిరిగాని యిప్పుడు కన్నులుచక్కఁగాఁ దెలిసిన తర్వాత సయితము మనయింగిలీషుమరభిమానము విడువక యిదివఱకుఁ జేసియున్న తీర్పులననుసరించి బ్రిటీషు న్యాయాధిపతులు శాస్త్రమును బ్రత్యక్షముగా నతిక్రమించుచుండుట న్యాయముకాదు సుమీ.

ధర్మశాస్త్రార్థములు దెలియుటకుఁ దగినమూలస్థానములు విడిచి యింగిలీషుమతాచారములు ప్రబలించుచోటికిఁబోవుకొలఁది బ్రిటీషు ధర్మస్థానములవారిచేత శాస్త్రవిరుద్ధముగాఁ జేయఁబడిన తీర్పులనేకములు కానఁబడుచున్నవి. మద్రాసు సూప్రీమ్ కోర్టువారు చేసినతీర్పులు నేనుజూడలేదు. అవి ప్రకటింపఁబడినవియుఁగావు. అయినను వారు హిందూ ధర్మశాస్త్రవిషయమందుఁ బొరపాటువడిరనుట సుప్రసిద్ధము. అక్కడిన్యాయాధిపతులును వకీళ్లును శాస్త్రము తెలియనివారు. వారికిసహాయము చేయను బండితులు సయితము లేరుగనుక వారుపొరపాటుపడుట యాశ్చర్యముకాదు. హర్ మెజస్టీ రాణిగారి ప్రివికౌన్సిల్ యొక్క జూడిషియాల్ కమిటీవారుచేసిన తీర్పులు ప్రకటింపఁబడినవి. ఘనులయి

నియాసభవారు ధర్మశాస్త్రమవలంబించు జనులకు బహు
దూరమందు వసించువారై తమవసించుచోటనే తమకు స్వా
భావికముగాఁదోఁచిన యభిప్రాయముల ననుసరించి యక్క
డనే యీశాస్త్రమును విచారింపఁబూనిరి కాఁబట్టి శాస్త్ర
మునకు విపరీతార్థములు చేయసాగిరని నాకుఁదోఁచుచున్నది.
ఇట్లువారు మదరాసుతగవులు కొన్నిటియందుఁజేసిన తీర్పుల
ను నేనువివరించి యుదాహరించితిని. శాస్త్రమిట్టిదని యేర్ప
ఱచుట నాతలంపుగనుక దానిఁజెప్ప వెడలినవాఁడనుగాను.

అయినను హిందూధర్మశాస్త్రము సూక్ష్మార్థములుగలిగి
సుఖబోధముకాకయుండుటయుకాక మిక్కిలి కొందఱికిమా
త్రమే యదిచదువ లభ్యమగుటయును నొకగ్రంథమునొ
క్కయర్థము మఱియొకగ్రంథముచూడనిదే తెలిసికొనుటదు
ష్కరమయియుండుటను జీవితులయిన పండితులవలనఁదప్ప
శాస్త్రముబోధయగుట దుస్తరమయియుండుటను విచారిం
పఁగా శాస్త్రములొరులచేత వ్యవహరింపఁబడుచున్నను -
నీదేశమందేని యీరాజధానిక్రిందిదేశమందేని బహుతర
ముగా శాస్త్రముచక్కఁగాఁదెలిసికొఁబడియథార్థముగాఁ
జెల్లుఁబడికిఁదేఁబడుట మిక్కిలిశ్లాఘనీయమైనదిసుమీ.

౧౮౭౩ సం॥
చెన్నపట్టణము

టి. ఎల్. స్ట్రెంజి.

## పుటాంతరములు.

౧. ౩౩౫................ ఇట్లు వ్రాసినయంకములు సర్ తామస్ స్ట్రేంజి గారి " యెలిమెన్ట్సు ఆఫ్ హిందూలా" యందలి పుస్తకసంఖ్యాపుటసంఖ్యలకు జ్ఞాపకములు.

కో........................ కోల్ బ్రూక్ దొరగారు.

స........................ సదర్ లాండుదొరగారు.

ఎ........................ ఎల్లిస్ దొరగారు.

బ. స. ది. అ................ బంగాళము సదర్ దివాని అదాలతు.

స. కో...................... [మదరాసు] సదర్ కోర్టు.

ఉ. ఖం. ప్రో. కో.......... ఉత్తరఖండము ప్రోవిన్షియాల్ కోర్టు.

ద. ఖం. ప్రో. కో.......... దక్షిణఖండము ప్రోవిన్షియాల్ కోర్టు.

ప. ఖం. ప్రో. కో.......... పశ్చిమఖండము ప్రోవిన్షియాల్ కోర్టు.

స. అ. పం.................. సదర్ అదాలతు పండితులు.

స. కో. పం.................. సదర్ కోర్టు పండితులు.

ప్రొ........................ ప్రొసీడిఙ్స్.

# అనుక్రమణిక.

# హిందూధర్మశాస్త్రసంగ్రహము.

## ౧. ప్రకరణము.

### శాస్త్రములయుత్పత్తిక్రమము.

శ్రుతిస్మృతులు।

౧. హిందువులుతమ శాస్త్రములీశ్వరోక్తములని చెప్పుదురు. అందొక భాగము శ్రుతియనఁబడును. శ్రుతియనఁగా ధర్మశ్రవణమునకుసాధనమని యర్థము. ఇదియె వేదము. ఇందు ముఖ్యముగామతవిషయములు చెప్పఁబడుచుండును. అవి బ్రహ్మముఖమునుండిబయలువెడలి, వెడలినమాటలవరుసనే వ్రాతయం దేర్పడినదని నమ్మెదరు. మరియొక భాగముస్మృతియనఁబడు. స్మృతియనఁగా స్మరింపఁబడినదనియర్థము. ఇందుధర్మస్థానములకుఁ గావలసిన వ్యవహారవిధులు చెప్పఁబడియున్నవి. స్మృతికి ఋషులుప్రవర్తకులని యెంచుచున్నారు. (౧. ౩౧౫ కో; మార్లి ౧. అవతారిక ౧౮౮)

మూలములు వ్యాఖ్యానములు। నిబంధనగ్రంథములు

౨. ఇట్లుస్మృతులు వ్యవహారవిధుల కాకరములు. వీనికి వ్యాఖ్యానములు కానఁబడుచున్నవి. ధర్మశాస్త్రమందలి సర్వాంశములనుగాని కొన్నియంశములనుగాని వివరించు ప్రకరణగ్రంథములును గలిగినవి. ఇవియెనిబంధనగ్రంథములని వాడుదురు. (౧. పీఠిక ౧౧; మార్లి ౧అవ. ౧౯౨)

౩. స్మృతులు ౨౦ అనియు ౩౬ అనియు నానావిధముగా లెక్కించెదరు. అందుమనుస్మృతి పరమప్రమాణమయి

స్త్రాచీనమయి యుండును. సర్ - ఉల్లియం- జోన్సుగారిచేత నిది యింగిలీషు చేయఁబడ్డది. తక్కినస్మృతులు దీనివలెనే యేర్పాటును సిద్ధాంతమునుగలిగియున్నవిగాని యిప్పుడు సమగ్రములుగావు. మనుస్మృతి కృతయుగమునకై యేర్పడిన ది. ఇట్లాయాయుగమునకుఁ దగిన స్మృతియేర్పడియున్నది. లోకాచారము శాస్త్రవిధులకుఁ బ్రతికూలమయియుండుటఁ బట్టిచిరకాలమునకువానియర్థముల ప్రకాశములయినవి. కాఁ బట్టి శాస్త్రార్థనిర్ణయమునకు వ్యాఖ్యానగ్రంథ నిబంధనగ్రంథములే యిప్పుడు శరణము. (౧. పీఠిక ౧౨, ౧౩ ; మార్లి ౧. అవ. ౧౯౨—౧౯౪, ౨౦౧)

శాస్త్రసంప్రదాయములయిదు.

౪. కాలక్రమమున శాస్త్రమునకు వేఱువేఱుసంప్రదాయములు గలిగినవి. ఆయా సంప్రదాయము ముఖ్యముగా నొక్కొక్కవ్యాఖ్యాత ననుసరించి ప్రవర్తించుచున్నది. బంగాళదేశమందు గౌడసంప్రదాయమని, యుత్తరబేహారునందు మైథిలసంప్రదాయమని, కాశీదేశమందుఁ గాశీసంప్రదాయమని, మహారాష్ట్ర దేశమందు మహారాష్ట్ర సంప్రదాయమని, చన్నపట్టణ దేశమందు ద్రవిడ సంప్రదాయమనియును సంప్రదాయము లయిదుగలిగినవి. సిద్ధాంతమందీసంప్రదాయములకుఁ బరస్పర భేదమంతగాలేదు. గౌడసంప్రదాయమందుమాత్రము సిద్ధాంతభేదము లనేకములుపుట్టినవి. ముఖ్యముగా దాయభాగమందు విశేషభేద మేర్పడియున్నది. (మార్లి ౧. అవ. ౧౮౯—౧౯౧)

కాశీబంగా

౫. కాశీసంప్రదాయము తక్కినమూఁడు సంప్రదాయ

ములకుమూలము. కావునధర్మశాస్త్రవ్యాఖ్యాతలు కాశీసం ప్రదాయమువారని బంగాళ సంప్రదాయమువారని రెండు గొప్పతెగలవారు. బంగాళసంప్రదాయమందు ధర్మశాస్త్రార్థములు యుక్తివాదములచేత దిద్దుపాటుగలిగియున్నవి. కాశీసంప్రదాయమందు మూలార్థమే కేవల మనుసరింపఁబడుచున్నది. (౨. 3౧౬, 3౧౭ కో)

శ సంప్రదాయములు।

౬. ఇటమీఁదఁ జెప్పెడు గ్రంథములు ద్రవిడసంప్రదాయమందు ముఖ్యప్రమాణములు. వానిలోఁజెప్పిన యాచారములే యీగ్రంథమందుఁ జెప్పఁబడును.

ద్రవిడ సంప్రదాయమందుముఖ్యగ్రంథములు।

(౧.) మితాక్షర—ఈగ్రంథము విజ్ఞానేశ్వర యోగిచేత రచియింపఁబడినదిగనుక విజ్ఞానేశ్వరీయమనియును వాడఁబడును. ఇదియాజ్ఞవల్క్యస్మృతికి వ్యాఖ్యానము. ఇందితర స్మృతివచనము లుదాహరింపఁబడి యున్నవి. దీనియందాచారకాండము వ్యవహారకాండము ప్రాయశ్చిత్తకాండమని మూఁడుకాండములు. రెండవకాండమందలి దాయభాగప్రకరణము కోల్‌బ్రూక్ దొరచేత నింగిలీషు చేయఁబడినది. ఆకాండమందు మఱికొంత భాగము డబ్బిల్‌యు - పచ్చి - మెక్‌నాటన్ దొరచే నింగిలీషు చేయఁబడినది. మితాక్షర కాశీసంప్రదాయమందు ముఖ్యప్రమాణము. అందుచేతనే ద్రవిడ సంప్రదాయమందు సహితమది ప్రమాణముగా గ్రహింపఁబడుచున్నది. ఈగ్రంథనామము ధర్మశాస్త్రమునకు ముఖ్యప్రవర్తకుఁడయిన మనువు యొక్క గ్రంథనామముతోఁ జేర్చి రెంటికి సాధారణముగామను - విజ్ఞానేశ్వరీయమనిపే

రుపెట్టి యిందు సమస్తధర్మములు చెప్పఁబడియున్నవని వాడుదురు.

(౨.) స్మృతిచంద్రిక—ఇది దేవనభట్టుచే రచింపఁబడినది. ఈగ్రంథముచన్నపట్టణదేశమందుఁగలిగియక్కడనేయాచరింపఁబడుచున్నది. ఇదిమితాక్షరకు రెండవదిగా గణింపఁబడుచున్నది. ఈగ్రంథముకొన్నిసిద్ధాంతములయందు మాత్రముమితాక్షరకు విరోధించుచున్నది.

(౩.) సరస్వతీవిలాసము—ఈగ్రంథము స్మృతిచంద్రికవంటిది. దీనికర్తప్రతాపరుద్రుఁడు.

(౪.) వ్యవహార మయూఖము—ఈగ్రంథమర్థ వ్యవహారదండవ్యవహారములు తెలుపుచున్నది. దీనికర్తనీలకంఠుఁడు. ఇదిమహారాష్ట్ర సంప్రదాయమందు ముఖ్యప్రమాణము. ఈగ్రంథము బారెడేల్ దొరచేత నింగిలీషు చేయఁబడ్డది.

(౫.) మాధవీయము—ఈగ్రంథము మాధవాచార్యులు చేసినది. ఇదిపరాశరస్మృతికిముఖ్యముగా వ్యాఖ్యానము.

ఈయయిదుగ్రంథములు పరమప్రమాణముగా గణింపఁబడుచున్నవి. గనుకనే వీని సంఘాతము పంచగ్రంథియని యుదాహరింతురు.

(౬.) వరదరాజీయము—ఈగ్రంథము వరదరాజనుపండితుఁడుచెప్పినది. ఇదిస్మృతిచంద్రికవంటిదే.

(౭.) స్మృతిముక్తాఫలము—ఈ గ్రంథము వైద్యనాథదీక్షితులురచించినదిగనుక వైద్యనాథదీక్షితీయమనియును వాడఁ

బడుచున్నది. ఇందువైదికవిధులు వివరింపఁబడుచున్నవి.

(౮.) నిర్ణయసింధువు—ఈగ్రంథము కమలాకర భట్టు చేత రచియింపఁబడినది. ఇందులౌకికవైదిక ధర్మములు చెప్పఁబడుచున్నవి.

(౯.) మన్వర్థముక్తావళి—ఈగ్రంథము మనుస్మృతికివ్యాఖ్యానము. ఇదికుల్లూకభట్టుచే విరచింపఁబడుటఁబట్టి కుల్లూక భట్టీయమనియును వాడఁబడును. ఇదేయిప్పుడు ప్రసిద్ధమైన మను వ్యాఖ్యానము.

(౧౦.) దత్తమీమాంస—ఈకృతినందపండితుఁడు చేసినది. దత్తచంద్రిక—ఈకృతి దేవానందభట్టుచేసినది. ఈ రెండును దత్తవిషయక ములయిన గ్రంథములు. ఆవిషయమందుముందు చెప్పిన సర్వసంప్రదాయముల వారికిని బ్రమాణమయియున్నవి. ఈరెండుగ్రంథములు సదర్లాన్డు దొరచేత భాషాంతరము చేయఁబడినవి. మఱియునుదత్తమీమాంసయని పేరుగలగ్రంథములు రెండుగలవు. అందొకటికి మాధవాచార్యుఁడుకర్త. మఱియొకటికిశ్రీరామపండితుఁడు.

౭. జీమూతవాహనుఁడుచేసిన దాయభాగమను గ్రంథము బంగాళదేశమందు దాయభాగమునకు ముఖ్యప్రమాణము. కోల్ బ్రూక్ దొరచేత నిదియింగిలీషుచేయఁబడినది.

బంగాళసంప్రదాయమునకుముఖ్యప్రమాణము।

౮. జగన్నాథీయమను నాధునిక ప్రకరణ గ్రంథము - సర్ - ఉల్లియం - జోన్సుగారు జగన్నాథపండితునిచేతఁ జే

జగన్నాథనిబంధనగ్రంథము।

యించినది. ఇది కోల్ బ్రూక్ దొరచేత నింగిలీషు చేయఁ బడినది. ఇదిసకలశాస్త్రసంగ్రహమయి యున్నదిగాని సిద్ధాంతముల యేర్పాటుమాత్రము లేదు. ఇందుసంగ్రహించిన పరస్పరవిరుద్ధ వచనములయందు సిద్ధాంతవచన మిదియని యేర్పడకున్నది. భాషాంతరము చేసిన కోల్ బ్రూక్ దొర చేతనే యిట్లుదూషింపఁ బడినది. ఇదిబంగాళ సంప్రదాయానుసారి.

ఆచారములేని శాస్త్రములు.

౯. హిందూధర్మశాస్త్రములయందు బంగాళకాశీ సిద్ధాంతముల భేదమువివేచించి తెలిసికొనవలసినది మాత్రముగాక ప్రకృతమందు లోకాచారము లేని శాస్త్రాంశ మిదియనియాచారముగలిగిన శాస్త్రాంశమిదియని వివేచించి తెలిసికొనవలసినది.

తక్కువజాతి స్త్రీని పెండ్లాడుట.

౧౦. ఆదికాలమందు బ్రాహ్మణునకు నికృష్టవర్ణములయందు వివాహము విధిచోదితమేకాని పుట్టిన బిడ్డలకుమాత్రముమాతృవర్ణాను రూపముగా దాయభాగమందు వైషమ్యము గలిగియుండెను. ఈవిధి కలియుగమందు నిషిద్ధము కాఁబట్టి బ్రాహ్మణునకునికృష్టవర్ణమునందు వివాహముకూడదు. (౧. ౩౯, ౪౦)

జ్యేష్ఠాంశము.

౧౧. విభాగమందు జ్యేష్ఠునకు జ్యేష్ఠాంశమనియధికభాగమిచ్చుచుందురు. ఇప్పుడాయాచారములేదు. (౧. ౧౩౩, ౧౯౨, ౧౯౩)

పండ్రెండు విధములపుత్రులు.

౧౨. మఱియుఁ బండ్రెండు విధముల పుత్రులుగలరు. అందాఱుగురు జన్మముచేతను పుత్రులయినవారు. ఆఱుగురు

నానావిధ స్వీకారములచేత నైనవారు. మొదటఁ జెప్పినయాఱుగురిలో నెకఁడు నియమింపఁబడిన జ్ఞాతివలనఁబుట్టినవాఁడు. వీఁడు తనతండ్రి యొక్క క్షేత్రమందు జ్ఞాతివలనఁ బుట్టినవాఁడుగనుక ద్వ్యాముష్యాయణుఁడని చెప్పఁబడును. ద్వ్యాముష్యాయణుఁడనఁగా నిద్దఱుతండ్రులకుఁగలిగినవాఁడు. ఔరసదత్తులు మాత్రమీకాలము పుత్రులని గ్రహింపఁబడుచున్నారు. ఔరసుఁడనఁగా భార్యయందుఁ దనకుఁబుట్టినవాఁడు. దత్తుఁడనఁగా దానముచేత స్వీకరింపఁ బడినవాఁడు. (౧. ౭౪, ౭౫, ౨. ౮౨ కో)

౧౩. ఆచారములేని శాస్త్రాంశములు మఱియునుగలవు గాని చెప్పుటకంతా వశ్యకములుగావు.

సిద్ధాంతవిషయము।

౧౪. కాశీ చన్నపట్టణ సంప్రదాయములకును బంగాళ సంప్రదాయమునకునుగల ప్రసిద్ధభేదములు ప్రత్యేకముగా నెకప్రకరణమందు వివరింపఁబడును.

కాశీబంగాళ సంప్రదాయములు।

౧౫. హిందూమతము ననుసరించినవారు మాత్రము గాక క్రీస్తువులయిన హిందువులును వారివంశస్థులయిన క్రీస్తువులును హిందూధర్మశాస్త్రము ననుసరించి ప్రవర్తించిరి. క్రీస్తుమతగ్రంథమందు దాయమునుగూర్చి నిబంధనలుగాని వేఱొకనిబంధనగాని లేకపోవుటచేతను క్రీస్తువులయిన హిందువులు బహుసంవత్సర శతములనుండి తమపూర్వుల శాస్త్రము నేదేశాచార ప్రకారము వలయునంత వాడుకొనుచుండిరి, (స. కో. ౧౮౫౮ అ. నం. ౧౮౭ లో తీర్పు)

శాస్త్రానుసారులు।

౧౬. ఉత్తర మళయాళమునందుఁ బూర్వము హిందూ స్త్రీలయందుఁబుట్టి మహమ్మదీయమతము ననుసరించిన మాపిళలను వారచ్చటి హిందువులవలెనె మరుమక్కచాయమ నేడు భాగినేయ భాగవిధిని బహుసంవత్సర శతములనుండి యాచరించుచున్నారు. (స. కో. ౧౮౫౫ స్పె. అ. నం. ౧౩౪ లో తీర్పు)

౧౭. దుర్నీతిచేతను దుష్ప్రవర్తనచేతను రూఢముగా జాతిభ్రష్టులయిన నీచజాతులవారు కొందఱు ప్రకృతమందు హిందూసమూహము లోనివారుగా గ్రహింపఁదగినవారైతమకుసరిపడినంతవఱకు హిందూ ధర్మశాస్త్రము ననుసరించుచున్నారు. వారాచార బద్ధులేకాని శాస్త్రబద్ధులుగారు.

## ౨. ప్రకరణము.

### వివాహము.

౧౮. కన్యక యెనిమిదవయేఁటిప్రాయమందు వివాహమునకర్హురాలని శాస్త్రముచెప్పుచున్నది. (౧. ౩౬)

*కన్యకలకువివాహకాలము*

౧౯. అయినను రెండవయేఁడు మొదలుకొని ఋతుకాలమువఱకు వివాహము కన్యకలకుఁ జేయుచున్నారు. (వైద్యనాథదీక్షితీయమందలి ప్రజాపతివచనము)

౨౦. బ్రాహ్మణకన్య పెండ్లికాకమునుపు ఋతుమతి యయ్యెనా జాతిభ్రష్టురాలవును. వైద్యనాథదీక్షితీయమందలి బృహస్పతివచనము)

౨౧. వివాహమయిన కన్యక రజస్వలయగువఱకుఁబుట్టినింటనే యుండవచ్చును. తరువాత భర్తతనయింటికిఁదోడుకొనిపోవుచున్నాఁడు. (౧. ౩౬, ౩౭)

*భర్తతనయింటికిఁ గొనిపోవుట.*

౨౨. కన్యకకు భర్తను సంపాదించు నధికారముతండ్రిది. అతనిమరణానంతరము కన్యకయొక్క-పితామహుఁడు - సోదరుఁడు - పితృవ్యుఁడు - సకుల్యులు - తల్లియును - వరుసగా నాయధికారముపొందుదురు. (౨. ౨౮ కో)

*భర్తనువరించుట.*

౨౩. కన్యక తనయెనిమిదవ సంవత్సరము మొదలుకొని మూఁడుసంవత్సరముల వఱకుముందుచెప్పిన బంధువు లెవ్వరును దనకు వరుని సంపాదింపనిపక్షమునకుఁదానేపతినివరింపవచ్చును. (౧. ౩౬)

పురుషులకు వివాహ కాలము।

౨౪. బ్రహ్మక్షత్రియవైశ్యులు వడుగు మొదలుకొని సమావర్తనము తుదిగా బ్రహ్మచర్యవ్రతము నెఱవేర్చకమును పు వివాహము చేసికోఁగూడదు. (మనువు 3 అ. 4 శ్లో) శూద్రులకు బ్రహ్మచర్యవ్రతము లేదుగనుక వివాహకాలమునకు నియమము లేదు.

అష్టవిధవివాహములు।

౨౫. వివాహములష్టవిధములు. వీనిలో బ్రాహ్మము దైవ మార్షము ప్రాజాపత్యమను నాలుగు వివాహములు బ్రాహ్మణులకు యోగ్యములయి యుండును. ఇవి పారమార్థికములు. గాంధర్వ రాక్షసములను వివాహములు క్షత్రియులకుఁ దగియుండును. ఇందు మొదటిదానికి దంపతుల పరస్పర ప్రేమయే నిమిత్తము. రెండవదానికి యుద్ధజయము నిమిత్తము. ఆసురమను వివాహము వైశ్య శూద్రులకు నియతములు. అది యోలియిచ్చి కన్యయొక్క తండ్రి సమ్మతిని బొంది చేయఁబడునది. పైశాచమను వివాహము కన్యకను వంచించి చేయఁబడును. ఇది సర్వవర్ణములయందు నిషిద్ధము. (౧. ౪౨, ౪౩ ; చిన్న మెక్‌నాటన్ ౧. ౫౯, ౬౦)

౨౬. ఆయావర్ణములవారికి వివాహభేదము లేర్పడియున్నవిగాని యాచారమందు నియతములు గావు. ఆసురము బ్రాహ్మణుఁడు చేసికొనవచ్చును. శూద్రుఁడు బ్రాహ్మము చేసికోవచ్చును. (మను వ్యాఖ్యయయినకుల్లూక భట్టీయమందు 3. ౨౪ ; స. కో. ౧౮౫౮ స్పె. అ. నం. ౧౯3 లో తీర్పు.)

౨౭. బ్రాహ్మాసురములుమిక్కిలి సర్వవర్ణసాధారణము

గాజరుగుచున్నవి. బ్రాహ్మము సర్వసమ్మతము. ఆసురము నింద్యము. (౧. ౪౨, ౪౩; చిన్న మెక్ నాటన్ ౧. ౬౦)

వివాహమును నెఱవేర్చుక్రియలు.

౨౮. వివాహపూర్తికిఁ గన్యాదానమును దత్పరిగ్రహమును సప్తపదియును ముఖ్యక్రియలు. ఒకపళ్లెరములో బియ్యము నెఱపి యేడుగుంట్లుగఁ జేసి యా యేడుగంతలమీఁద వరుఁడు పెండ్లికొమార్తె కాలుపట్టి గంతగంత కొక్కొక్కసారి వరుసగా నుంపించుట సప్తపదియనఁబడును. ఇందుచేత నేయిద్దఱు చెలిమి యొడంబడికకయి కూడి యేడడుగులు నడుచు నాచారము గలిగినది. కాఁబట్టి సాప్తపదీనమను శబ్దము సఖ్యమునకు వాచకమయినది. ఈక్రియతోనే వివాహము పూర్ణమవుచున్నది. హోమములోనయిన యితరక్రియలు విశేషములుగావు. వరుఁడు కన్యకంఠమందు మంగళసూత్రము కట్టుట లోకాచారము గాని శాస్త్రీయము గాదు. (గృహ్యసూత్రము)

౨౯. ముందుచెప్పిన వివాహసిద్ధిచేతనే వధూవరులు పరస్పరబద్ధులగుదురుగాని నిషేకముచేతఁగాదు. సమర్త్తాడిన వెనుక భార్యను భర్త తనయింటికి వెంటఁబెట్టుకొని పోవుచున్నాఁడు. ఈవివాహమునకు వెనుక భర్త మృతిఁబొందెనా స్త్రీకి వైధవ్యమును దానికనురూపములయిన కార్యములందు గర్తృత్వమును దనభర్తకు రావలసిన దాయభాగము తాను బుచ్చుకొను నధికారమును గలుగుచున్నవి. (౧. ౩౭; ౨. ౩౨, ౩౩. ౨)

నిశ్చితార్థవిరోధము.

౩౦. వివాహము నిశ్చితార్థముచొప్పున నడవక తప్పెనా దానిచేత విశేషహాని యేదియును లేదు.

౩౧. తీఱనివ్యాధి కానివావి మొదలయినయట్టి శాస్త్రోక్తప్రతిబంధములచేతఁగాని కన్యకామరణముచేతఁగాని నిశ్చయించిన వివాహము నెఱవేఱకపోయెనా వివాహనిమిత్తముకన్యకుఁగావరుఁడిచ్చిన ద్రవ్యము తిప్పివేయవలసినది. నిశ్చయింపఁబడిన వరుఁడు రెండుపక్షములవారి సెలవులు తానేయచ్చుకోవలసినది.(౧. ౩౮) కన్యకపక్షము వారుశాస్త్రోక్తమయిన ప్రతిబంధములేకయే మరలఁబడిరేని వారేజరిగిన సెలవులన్ని వరునికియ్యవలసినది.

జాతిభ్రంశము. ౩౨. దంపతులలోనొకరు జాతిభ్రంశము పొందిరేని వారిపరస్పర సంబంధము నివర్తించును. జాతిభ్రష్టురాలిని మృతురాలినివలె భావించియుత్తరక్రియలు చేయవలసినది. (స్మృతిచంద్రికయందు వసిష్ఠయాజ్ఞవల్క్యవచనములు) అట్లు పుత్రవతిని భావింపఁగూడదు. పుత్రుఁడామెను భరింపవలసినది.

స్త్రీవ్యభిచారము. ౩౩. వ్యభిచరించినస్త్రీకి జాతిభ్రంశము కలుగుచున్నది. అంతటితో వివాహసంబంధము సహితము తీఱిపోవును. హీనజాతులుకొన్నింటికి నియమములేదు. (స్మృతిచంద్రిక) జారునిచేత నష్టిపుచ్చుకొనుటకు భర్తకధికారములేదు. ఏవిషయమందును నష్టము పురుషునకియ్యవలెనని శాస్త్రము లేదు. (౨. ౪౦-౪౪, ౨౬౫ కోా. ౬)

దంపతులెడఁబాయుటకు నిమిత్తములు. ౩౪. నపుంసకత్వముగాని గోత్రాలితనముగాని యిద్దఱిలోనొకరికి హేయమైన వ్యాధిగాని తీఱనివ్యాధిగాని దం

పతుల వియోగమునకు నిమిత్తములు. (౧. ౪౮) అయిన నివి వివాహబంధమును మాన్పఁజాలవు. (మనువు ౯. ౭౯)

భార్యాబాహుళ్యము.

౩౫. పురుషుఁడు మేరలేక బహుస్త్రీలను వివాహము చేసికోవచ్చునుగాని తగిన నిమిత్తములులేక వేఱుభార్యను గ్రహింపఁగూడదు. అసాధువృత్తి సదా ప్రాతికూల్యము, దుర్గుణము, వ్యాధి, గొడ్రాలితనము, పది సంవత్సరములవఱకాఁడు బిడ్డలనేకనుట యను నవి యానిమిత్తములు. స్త్రీ దోషరహితురాలయినను దానియనుమతిచేతఁ బురుషుఁడు వివాహము చేసికొనవచ్చును. (౧. ౪౫, ౪౬, ౫౨, ౫౩) అయినను జరిగిపోయిన వివాహమునకీ నిమిత్తములు లేకుండినను జెల్లుబడి లేక పోదు. (స్మృతిచంద్రికయందు దేవలవచనము)

రెండవవివాహకాలమందియ్యవలసిన స్త్రీధనము.

౩౬. రెండవ వివాహమునకు నిమిత్తము భార్యయొక్క సమ్మతియే యయినపక్షమందు భార్యకుఁ బారితోషికమిచ్చి యామెయనుమతిపొందవలసినది. (మితాక్షర ౨అ. ౧౧ప్ర ౩౪ శ్లో) ఈపారితోషికమునకుఁగాను భార్యభర్తమీఁదఁదగవు తేవచ్చును. ఆమెయందు దుశ్చరితములు కలవనుటకు నిదర్శనముండినపక్షమందామె తెచ్చిన తగవు చెల్లదు. (స్మృతిచంద్రికయందు వసిష్ఠయాజ్ఞవల్క్యవచనములు)

త్రోయఁబడిన భార్యవసింప వలసిన తావు.

౩౭. న్యాయముకలిగికాని లేకకాని రెండవ వివాహముచేత నిరాకరింపఁబడిన భార్య భర్తతోనే వసింప వలసినది. తనతోఁగూడివసింపఁగూడదని భర్తచేత వారింపఁబడిన స్త్రీ భర్తయొక్కబంధువులయొద్దఁగాని తనబంధువులయొద్దఁగాని

వసింపవలసినది. (౧. ౫౪, ౫౫) ఎక్కడవసించినను భర్త భార్యను బోషింపవలసినది. (స్మృతిచంద్రికయందు బృహస్పతివచనము)

వితంతువివాహము।

౩౮. శూద్రులలో శాస్త్రబద్ధులుగాక వాడుకననుసరించునట్టి నికృష్టజాతులకుఁదప్ప వితంతువునకు వివాహవిధి హిందూధర్మశాస్త్రమునందు లేదు. ఇండియాదేశపు బ్రిటిష్ న్యాయసభవారీ శాస్త్రమునునిరసించియన్నివర్ణములయందునుబునర్వివాహములు జరిగింపవచ్చునని యువారికిఁబుట్టినవారుకులీనులనియుఁ బ్రకటించిరి.(౧౮౫౬ వ ౧౫ శాసనము)

౩౯. వితంతువునకు వివాహమయినంతట మృతుఁడైన పెనిమిటి యాస్తియందు భరణాధికారముగాని దాయాధికారముగాని నివర్తించును. (౧౮౫౬-౧౫ వ శాశనము ౨వ ప్రకరణము)

చేరుగొండి పెండ్లి।

౪౦. తక్కువజాతి శూద్రులందుఁ బురుషుఁడు స్త్రీని గొంతకాలము చేరుగొండి గానుంచుకొని వివాహముచేసి కొనవచ్చును. (స. అ. పం. ౧౮౫౪ జూన్ ౨౬)

౪౧. అట్టితక్కువజాతులయందు వివాహమునకుముందుపుట్టిన బిడ్డలు వెనుక జాత్యాచారమున్నపక్షమందు న్యాయ్యమయిన సంతతిగా నొప్పుకొనఁబడుదురు. (స. అ. పం. ౧౮౫౪ జనవరి ౨౬)

౪౨. అలవవెలమలలోఁజేరుగొండిదోషముగలిగినస్త్రీ నివివాహముచేసికోఁగూడదు. (స. అ. పం. ౧౮౫౫ మే ౧౬)

౪౩. వివాహము చేసికొను దంపతు లొకజాతివారై యుండవలెను. (౧. ౪౦)

వధూవరులు సమజాతీయులై యుండుట।

౪౪. బ్రాహ్మణులందఱు నూటయేఁబది యయిదుగోత్రములవారు. (ధర్మనిర్ణయమందు ఆపస్తంబసూత్రము) ఆయాగోత్రమునకొక్కొక ఋషి మూలపురుషుఁడు. కొన్ని క్షత్రియవంశములు బ్రహ్మఋషులవలనఁగలిగినవి. తక్కిన క్షత్రియులును వైశ్యులును దమతమపురోహితుల గోత్రములనే తమకు వాడుకొందురు. ఈనానావిధగోత్రములు పురుషపరంపరనుబట్టివచ్చుచున్నవి. స్త్రీలు వివాహమునకు వెనుక భర్తయొక్కగోత్రము గలవారగుదురు. (నిర్ణయసింధువు) ఈమూఁడు జాతులవారికి సగోత్రావివాహము నిషిద్ధము. (మనువు ౩. ౫)

వివాహము నకుఁ దగనివారి।

౪౫. ఈమూఁడు హెచ్చుజాతులవారికిఁదండ్రివంకవారితో సగోత్రావివాహముకూడదు. తల్లి మొదలు ముందఱి నాలుగుతరములదాకఁ దల్లివంకవారితోవివాహముకూడదు. (నిర్ణయసింధువునందు వసిష్ఠవచనము)

౪౬. శూద్రులకు గోత్రములేకుండినను దండ్రికిముందఱి యాఱుతరములలోఁగాని తల్లికిముందఱి నాలుగుతరముల లోఁగాని పుట్టినవారిని వివాహము చేసికొనుటనిషిద్ధము. (నిర్ణయసింధువునందు వసిష్ఠవచనము)

౪౭. ఈనియమములకు బహుతరముగాలోకాచారము క్షీణించినది. సాధారణముగా సమస్త వర్ణములయందును దల్లిదండ్రుల తోఁబుట్టువులతోఁగాని వారిసంతతి వారితో

గాని తోఁబుట్టువులతోఁగాని వారి సంతతి వారితోఁ గాని వివాహసంబంధముయొక్క నిషేధమమాత్రము పాటింపఁబడుచున్నది. (నిర్ణయసింధువునందుఁ గాత్యాయన పరాశరాదుల వచనములు, కాలామృతమందు ౬౨ శ్లో; ధర్మప్రవృత్తియందు వ్యాఘ్రపాదవచనము.)

స్వీకృతపుత్రునికిఁ గాని వావి।

౨౮. దత్తపుత్రుఁడు తన్నుఁగన్నవారి పరంపరయందును గొన్నవారిపరంపరయందును ముందుచెప్పిన వివాహసంబంధనిషేధముపాటింపవలసినది. వానిసంతతివారుసహితమీనిషేధముపాటింపవలసినది. (నిర్ణయసింధువునందు)

## 3. ప్రకరణము.

### పుత్రస్వీకారము.

నరకార్హత్వ।

౪౯. వివాహము చేసికొన్నవాఁడు తనమరణానంతరము పుత్తను నరకమునకుఁబోవలసినవాఁడని హిందువులు తలఁచెదరు. పుత్రవంతునికీనరకములేదు. పుత్తను నరకము వలనఁగాచువాఁడు గనుక సుతుఁడు పుత్రుఁడనఁబడును. (మనువు ౯. ౧౩౮)

పుత్రునియావశ్యకత।

౫౦. వివాహము చేసికొన్నవానికి సుతుఁడవశ్యముగాఁ గావలెననుటదీనిచేతనే తేటపడుచున్నది. సహజముగాసంతానములేనివాఁడవశ్యము పుత్రస్వీకారముచేయవలెనని విధిగలదు. (౧. ౭౬)

పుత్రునిఁబోఁగొట్టుకొన్నవాని స్వీకారము।

౫౧. పుత్రుఁడు జన్మించినమాత్రానఁబున్నామ నరకమునివర్తించుచున్నది. నష్టపుత్రకుఁడు పుత్రజన్మముచేతనే నరకమునకుఁ దొలఁగినవాఁడైనను దన యపరక్రియలకై వంశవృద్ధికై పుత్రస్వీకారముచేయవచ్చును. (నందపండిత దత్తమీమాంసయందు ౧. ౩, ౪)

ఉత్తరక్రియలు।

౫౨. మృతునియొక్క కోరికలు తీఱునట్లువానిపేరుచెప్పి పితృదేవతలకన్న పిండములను జలముల నిచ్చునపరక్రియలుచేయుదురు. పురుష సంతతి లేకుండెనా భార్యగాని సోదరులుగాని తక్కిన బంధువులుగాని తమతమ బాంధవ్యానురూపముగాయథాయోగ్యముగా నుత్తరక్రియలునెఱవేర్చెదరు. పుత్రుఁడు చేయునపరక్రియలుమాత్రముపూ

ర్ణఫలకముగా నెఱవేరును. (నందపండిత దత్తకమీమాంస యందు ౧. ౫౮, ౫౯)

పుత్రసంతతిలేమి।

౫౩. పుత్త్రుఁడుగాని పౌత్త్రుఁడుగాని ప్రపౌత్త్రుఁడుగాని లేనివాఁడే పుత్రహీనుఁ డనఁబడును. వాఁడే పుత్రస్వీకారముచేయవలసినది. పుత్త్రులులేనిపక్షమందు వారిసంతతివారుపుత్త్రునియట్లుత్తరాధికారులవుదురు. (౧. ౭౮. సదర్ లాన్డు ౨౨౨)

౫౪. జాతిభ్రంశము చేతఁగాని వెఱ్ఱిచేతఁగాని తీఱని రోగముచేతఁగాని యితర కారణము చేతఁగాని పురుషసంతతివారుదాయమునకర్హులుకానిపక్షమందు వారులేరనియెంచి పుత్త్రుఁడులేనివాఁడు వలెఁబుత్రస్వీకారము చేయవచ్చును. (౧. ౭౭)

స్వీకృతుఁడుండఁగా మఱియొకని స్వీకరింపఁగూడదు।

౫౫. తనస్వీకృతపుత్త్రుఁడు జీవించియుండఁగాఁ దాను బుత్రహీనుఁడుకాఁడు గావునమఱియొకని స్వీకరింపఁజెల్లదు. (మూర్ ౪. ౧౦౨)

భార్య గర్భిణి యై యుండఁగాస్వీకరించుట।

౫౬. భార్యగర్భిణియైయుండఁగాఁబుత్త్రుఁడు పుట్టునను సంభావన యుండుటఁబట్టి యప్పుడు పుత్రస్వీకారముకూడదు. (స. కో. ౧౮౫౯ స్పె. అ. నం. ౨౨౩ లో తీర్పు) తర్వాతఁబుత్రికపుట్టినను నాస్వీకారము చెల్లదు. (స. కో. పం. ౧౮౬౦ ఆగస్టు ౮)

స్వీకృతుఁడు పోయినపిమ్మట రెండవ స్వీకారము।

౫౭. స్వీకృతుఁడు పుత్త్రహీనుఁడయి మరణించెనా యౌరసమరణమునకది తుల్యముకావున వానికి మాఱుగా స్వీకారముచేయవచ్చును. (౧. ౭౮)

స్వీకర్తవయస్సు।

౪౮. పెండ్లియయినవాఁడు వయోవృద్ధుఁడు కాకపోయినను దన యవసానదశ సమీపించినదని తోఁచిన పక్షమందుఁ బుత్ర స్వీకారము చేయవచ్చును. (స. కో. పం. ౧౮౫౦ సెప్టెంబరు ౧.)

పెండ్లిలేని స్త్రీపురుషులుచేయు స్వీకారము।

౪౯. వివాహము లేనివాఁడు స్వీకారము చేయఁగూడదు. (స. పం. ౧౮౪౧ జూలై ౧౭)

౫౦. వివాహము లేనిపురుషులకెంతప్రాయము వారికిఁగాని స్త్రీలకు వివాహము చేసికొన్నవారికిఁగాని చేసికోనివారికిఁగాని పుత్తను నరకము లేదు. కావున నేవారికి స్వీకారమక్కఱలేదు. చేసికొనిరిపో చెల్లదు.

విపత్నీకుఁడుచేయు—

౫౧. విపత్నీకుఁడు స్వీకారము చేయఁగూడదు. (సోమనాథదత్తమీమాంస) వివాహము చేసికొని పుత్రప్రాప్తిలేని పక్షమందు స్వీకరింపవచ్చును.

దాయానర్హపురుషుఁడు చేయు—

౫౨. ఏనిమిత్తముచేతఁగాని దాయమునకనర్హుఁడయినవాఁడానిమిత్తముండువఱకుఁ బుత్రస్వీకారము చేయఁగూడదు. (మితాక్షర ౨. ౧౦, ౨)

ఆశౌచముగల పురుషుఁడు చేయు—

౫౩. కుటుంబమునందు మరణము చేతఁగాని మఱియేహేతువుచేతఁగాని యాశౌచములు కలిగియున్నప్పుడు పుత్రస్వీకారమునకు వలయు వైదికక్రియలు చేయఁగూడదు కాఁబట్టియట్టిసమయమునఁ బుత్రస్వీకారము చేయగూడదు. (స. పం. ౧౮౪౭ మార్చి ౨౩)

స్వీకృతుఁ

౫౪. స్వీకృతుఁడు పుత్రస్వీకారము చేయవచ్చును. ఈ

డుచేయు— లాగున స్వీకారపరంపరచేతనే యెంతవఱకుఁగాని వంశము వృద్ధినొందవచ్చును. (స. పం. ౧౮౪౫ డిసంబర్ ౨౨)

భార్యాభర్తలుచేయు— ౬౫. స్వీకారాధికారము భార్యాభర్తలలో భర్తకేకలదు గాని స్వీకరించినతల్లిదండ్రులిద్దఱికిని స్వీకృతుఁడు పుత్రుఁడయి యపరక్రియలు చేయుచున్నాఁడు. (౧. ౭౮, ౭౯)

ముత్తైదువగాని వితంతువుగానిచేయు— ౬౬. ముత్తయిదువగాని వితంతువుగాని తనభర్తయనుమతిచేత స్వీకారముచేయవచ్చును. అయినను స్వీకారమిదిభర్తదిగాని భార్యదిగాదు. (౧. ౭౯)

౬౭. కుటుంబసముదాయద్రవ్యమునకు స్వీకారముబాధకమయినను భార్యకుస్వీకారాధికారమిచ్చునపుడు తనతండ్రిదాయాదుల సమ్మతికోరబనిలేదు. (స. పం. ౧౮౪౫ జూలై ౩ ; ౧౮౫౦ జూన్ ౨౨)

౬౮. ఎప్పుడుగాని భర్తభార్యకు స్వీకారాధికార మియ్యవచ్చును. (మ. ఖం. ప్రొ. కో. పం. ౧౮౨౫ మార్చి ౮)

౬౯. భర్తభార్యకు స్వీకారాధి కారమిచ్చునపుడు వీనిని స్వీకరింపుమని నిర్దేశింపఁబనిలేదు. (స్ట్రేంజియొక్క రిపోర్టులు ౧. ౯౧)

౭౦. అట్టియనుజ్ఞ వ్రాసియుండవలెనని యక్కఱలేదు. (౧. ౮౦)

౭౧. అనుజ్ఞపొందినవితంతు వెంతకాలమున కయినను బుత్రస్వీకారముచేయవచ్చును. (స. పం. ౧౮౪౫ అక్టోబరు ; ౧౮౫౧ జూలై ౧౭)

౭౨. భర్తయొక్క యనుజ్ఞ లేని స్త్రీకి సహజముగా సంరక్షకులు గావున జ్ఞాతులు పుత్రస్వీకారాధికారమియ్యవచ్చును. (౧. ౭౯, ౮౦) ఇట్టియే యనుజ్ఞ లేక స్త్రీ తాను జేసికొన్న స్వీకారముచెల్లదు. (స. కో. ౧౮౧౪ ది. అ. నం. ౧౮లో తీర్పు)

౭౩. సమాంశ భాగులయిన జ్ఞాతులందఱు సమానులు గావున ముఖ్యముగా వారందఱుగూడి చేయవలసియుండఁగా వారియనుమతిలేక భర్తయొక్క జ్ఞాతియొక్కఁడు మాత్రముచేసిన యనుజ్ఞ చాలినదిగాదు. (స. పం. ౧౮౫౪ అక్టోబర్ ౯)

*వితంతుద్వితీయ స్వీకారము.*

౭౪. వితంతువు పుత్రస్వీకారము చేసికొనుటకు సామాన్యాధికారము పొందియుండెనేని మొదటిస్వీకృతుఁడు గతించినంతట రెండవ స్వీకారము కూడునని కొందఱు తలంతురు (౧. ౭౮; స.పం.౧౮౫౬ జనవరి ౧౭) ఆయధికారము మొదటి స్వీకారముతోనే సమాప్తిని బొందినది గనుక మఱియొకస్వీకారము చేసికోవచ్చుననుట యంగీకరింపఁ దగినది కాదు. ఇది ప్రమాణరహితమైన యభిప్రాయము.

*ఈడుచాలనివితంతువుచేయు స్వీకారము.*

౭౫. పున్నామనరకమునుండి తోడనేభర్తను విముక్తుని జేయుట యావశ్యకముగావున వితంతువు తనపసితనమందుస్వీకరించుటకుఁ గాలవ్యవస్థలేదుగాని యామె తనసంరక్షకుల సమ్మతిపొందియే స్వీకారము చేయవలెను.

*స్వీకారసిద్ధి*

౭౬. స్వీకారసిద్ధికిఁబాలుని దానపరిగ్రహములు రెండు

కి ముఖ్య క్రి యలు। ను ముఖ్యక్రియలు. దానములేని పరిగ్రహము చెల్లదు. (౧. ౯౫; స. పం. ౧౮౭౪ జనవరి ౨౧)

తల్లిసమ్మతి యావశ్యకము గాదు। ౭౭. తల్లిసమ్మతిలేకయే తండ్రి పుత్రదానము చేయవచ్చును. (౧. ౮౧)

తల్లిపుత్రుని చ్చుట। ౭౮. అక్కఱకలిగినపక్షమునకు భర్త యనుజ్ఞయున్నట్లుభావించి స్త్రీస్వతంత్రించి పుత్రదానము చేయవచ్చునుగాని భర్తజీవించియుండఁగాఁ జేయఁగూడదు. వాఁడుమృతుఁడయినను జిరప్రవాసము చేతఁగాని సన్న్యాసము చేతఁగాని జాతిభ్రంశము చేతఁగాని మృతప్రాయుఁడయినను స్త్రీస్వతంత్రించి పుత్రదానము చేయవచ్చును. (౧. ౮౧, ౮౨; సదర్ లాన్ డు ౨౨౫)

సోదరుఁడు— ౭౯. సోదరులందఱు సమానులుగాఁబట్టియొకసోదరునిచ్చుటకు మఱి యొకనికి స్వాతంత్ర్యము లేదు. (స. పం. ౧౮౭౭ ఫిబ్రవరి ౨౧; స. కో. ౧౮౫౧ రి. అ. నం. ౨౦ లో తీర్పు)

పితృవ్యుఁడు— ౮౦. ఆలాగుననే పితృవ్యునకు దానాధికారము లేదు. (చిత్తూరు జి. కో. పం. ౧౮౪౯ అక్టోబర్ ౨౩)

తల్లిదండ్రులు— ౮౧. పుత్రదానాధికారము తల్లిదండ్రులదేయని పర్యవసితార్థము. ఆయధికారము మొదటఁదండ్రిది. వానిపరోక్షమందుఁదల్లిది.

స్వీకర్తకుస్వీకృతుఁడు సవర్ణుఁడై యుండవలె। ౮౨. అసవర్ణుఁడయిన స్వీకృతుఁడు స్వీకర్తయొక్కయుత్తరక్రియలు చేయుటకుఁగాని దాయము పొందుటకుఁగాని (౧. ౮౨) పున్నామనరకమును దొలఁగించుటకుఁగాని య

ర్హుఁడుకాఁడు గావున స్వీకార్యుఁడు స్వీకర్తకు సవర్ణుఁడయి యుండవలెను.

౮౩ స్వీకర్తకు వాఁడు సగోత్రుఁడయి యుండవలెను. ఈవిధి నియతముగాదు. (౨. ౯౮, ౯౯ కో. ౨; సదర్ లాన్ డు ౨౨౩, ౨౨౪)

౮౪. స్వీకార్యుఁడు స్వీకర్త కౌరసప్రతి బింబుఁడయి యుండవలెనని మూలస్మృతివచనము. అనఁగాఁ బుత్రసదృశుఁడయి యుండవలెనని యర్థము. అనఁగా స్వీకార్యుఁడు స్వీకర్తకుఁ గొడుకు వావికిఁ దగినవాఁడయి యుండవలెనని తేటి నయర్థము. (నందపండిత దత్తకమీమాంసయందు ౫ అ. ౧౬ శ్లో) ఇట్లు చెప్పుటచేత స్వీకార్యునితల్లి న్యాయ్యముగా స్వీకర్తనువివాహము చేసికోఁదగిన వావిగలదియయి యుండవలెనని తాత్పర్యము. (౧. ౮౩ ; సదర్ లాన్ డు ౨౨౩)

స్వీకారము నకుఁ దగనివావి।

౮౫. ఈవిధిచేత నే సోదరుఁడును పితృసోదరుఁడును మాతులుఁడును దౌహిత్రుఁడును సోదరీపుత్రుఁడును స్వీకారార్హులుగారు. (౧. ౮౩)

౮౬. శూద్రులకు దౌహిత్రభాగినేయులను స్వీకరించుటయందు నిషేధము లేదు. (౧. ౮౩, ౮౪)

దౌహిత్రభాగినేయ స్వీకారము।

౮౭. ఆవశ్యకమయిన పక్షమందెల్లవర్ణముల వారును ముందుచెప్పినట్లు స్వీకారము చేయవచ్చును. (స. కో. ప్రొ. ౧౮౩౬ జూన్ ౪, ౨౫)

౮౮. ఆవశ్యకత లేకయే యట్టిస్వీకారము చేయు నాచా

రము ద్రవిడ దేశమందుఁ గలదు. (స. కో. ప్రొ. ౧౮౩౬ జూన్ ౮, ౨౫)

౮౯. వ్యవహార మయూఖమందును (స. పం. ౧౮౩౯ ఫిబ్రవరి ౨౫) వైద్యనాథ దీక్షితీయమందును (స. కో. పెద్ద పం. ౧౮౫౫ మే ౧౬) ఈయాచారమాదరింపఁబడినది.

భ్రాతను స్వీకరించుట।

౯౦. సోదరుని స్వీకరించుట చెల్లదు. (స. కో. ౧౮౫౧ స్పె. అ. నం. ౨౦ లో తీర్పు)

భార్యాసోదరుని —

౯౧. భార్యయొక్క సోదరుని స్వీకరించు నాచారముగలదు. (స. కో. ౧౮౫౬ స్పె. అ. నం. ౯౭ లో తీర్పు) స్వీకారము పురుషుని కొఱకుఁగాని స్త్రీకొఱకుఁ గాదనుటఁబట్టి యీస్వీకారము సమ్మతి కెక్కవచ్చును. కాఁబట్టి స్వీకార విషయమయి త్రోపుడయిన వావి పురుషుని బంధువులయం దేర్పడుచున్నదిగాని స్త్రీబంధువులందు లేదు.

తగనివావులు తెలుపుట।

౯౨. స్వీకృతుఁడు స్వీకర్తకు న్యాయ్యముగాఁగొడుకు వావికిఁ దగినవాఁడయి యుండవలెనని పర్యవసితార్థము. ఈవిధికివిరుద్ధముగా ద్రవిడదేశమందు మాత్రముదౌహిత్ర భాగినేయులను స్వీకరించు నాచారముగలదు. సర్వదేశములయందు శూద్రులుదౌహిత్రభాగినేయులను స్వీకరింపవచ్చును. ఇతరవర్ణములవారుసహితమావశ్యకత గలిగినపక్షమం దట్లు చేసికొనవచ్చును.

జ్యేష్ఠపుత్రునిఁగాని యేకపుత్రునిఁగా

౯౩. జ్యేష్ఠ పుత్రునిఁగాని యేకపుత్రునిఁగాని స్వీకరింపఁగూడదు. (౧. ౮౫)

౯౪. ఈనిషేధము ప్రమాణమేకాని యేకపుత్ర జ్యేష్ఠ పుత్రులదానము దాతకెంతదోషావహ మయినను గడచిన యీస్వీకారమునకుఁ జెల్లుబడిగలదు. (౧.౮౭; స. కో. ప్రొ. ౧౮౨౪ జూలై ౩౧; ౧౮౨౫ జూలై ౨౮)

ఏకపుత్రుఁడుగాని జ్యేష్ఠపుత్రుఁడుగాని పితృతత్సోదరుల కు ద్వ్యాముష్యాయణుఁడవునుగావున సోదరునియొక్కయే కపుత్ర జ్యేష్ఠ పుత్రస్వీకారమందీ నిషేధము లేదనియుఁ జె ప్పఁబడియున్నది. (౧.౮౬)

ప్రకృతనిషేధవ్యవస్థకు బలవత్తరములయిన దూషణము లుగలవు. పుత్రునిజన్మమే పున్నామనరకమునుండి తండ్రికి విముక్తిపుట్టించెడు ననుటచేత జ్యేష్ఠపుత్రుఁడుగాని యేకపు త్రుఁడుగాని పుట్టినతోడనే తనతండ్రికి విమోచనముఁ బు ట్టించెడు. కాఁబట్టివాఁడు పునర్విమోచనము పుట్టింపఁడు. పుత్రజన్మముయొక్క ఫలము జనకపితయందు వినియోగించి నది. అన్యునకు వినియోగింపనేరదు. అన్యునకుఁబున్నామ నరకమునుండి రెండవమోచనము పుట్టింప నేరదు. పూర్వ మేచెల్లిపోయిన ప్రయోజనముజనకపితవలనమరల గ్రహిం చి యన్యునకియ్యఁగూడదు. కాఁబట్టి యేకపుత్ర జ్యేష్ఠ పుత్ర స్వీకారము స్వీకర్తకుఁ బున్నామనరక ముక్తిరూప ఫలము పుట్టింపనేరదు. ఇట్లుస్వీకారము నిష్ఫలముగావునఁ జెల్లనే రదు. ద్వ్యాముష్యాయణుఁడను నిమిత్తముఁబట్టి సోదరుని యేకపుత్ర జ్యేష్ఠపుత్రులస్వీకారము చేయవచ్చునను విశేష విధియేర్పడియున్నదిగాని యీయేర్పాటెట్టిదయినను బ్రకృ

తమందాచారములేదు. ఈస్వీకార మాచారమందుఁ గలద నుపాటిగా లోకమందు వ్యాపించియున్నదిగాదు. ఈయా చారమరుదు. నిజమును బ్రమాణశతమయినను మాఱ్పఁజా లదను వచనమునుగోని పైస్వీకార ములనుగాని సిద్ధాంత మునుగాని పోషించుటకు యత్నించెదరు. (జీమూతవాహన ము అ. ౩౦) ఈవచనము బంగాళ దేశీయులకేకాని కాశీ సంప్రదాయమువారికి బొత్తిగాసమ్మతముకాదు. ఇందువల్ల జ్యేష్ఠపుత్రుఁడుగాని ఏకపుత్రుఁడుగాని స్వీకారమునకర్హు లుగారని ఫలితార్థము. కాఁబట్టి తుదకీస్వీకారము యొక్క నిషేధము దుర్వారము. ఈస్వీకారమెట్లు నడచినను జెల్లనే రదు.

స్వీకారమునకుఁదగినవాఁడు।

౯౫. మునుపుచెప్పిన సపిద్ధకోటి దప్పఁబురుషుని నేదిష్ఠ బంధువు స్వీకారమునకు మిక్కిలియర్హుఁడు. ఇట్టివాఁడేకోద రుఁడయిన భ్రాతయొక్క పుత్రుఁడు. ఈస్వీకారమనుజ్ఞాత మేకానియవశ్య విధేయముగాదు. (౧. ౮౪, ౮౫)

చేరుగొండి కొడుకును స్వీకరించుట।

౯౬. చేరుగొండియొక్క కొడుకువర్ణవ్యవస్థకు మీఁటి నవాఁడు గావున స్వీకారమున కర్హుఁడుకాఁడు. (స. పం. ౧౮౫౩ జూలై ౧౮)

పుత్రికాస్వీకారము।

౯౭. పుత్రిక పున్నామనరక విమోచనము చేయనేర దు. (మనువ్యాఖ్యయయిన కుల్లూక భట్టీయమందు ౯ అ. శ్లో. ౧౩౩) కాఁబట్టిపుత్రికాస్వీకారమంగీకరింపఁబడ్డది కా దు. (స. కో. ప్రొ. ౧౮౪౭ నవంబర్ ౨౩)

౯౮. అయినను వేశ్య తాను కొలిచెడుగుడి యధికారులయనుజ్ఞనుబొంది పుత్రికాస్వీకారము చేసికొనవచ్చును. పుత్రుని స్వీకరింపఁగూడదు. (స. పం. ౧౮౫౩ సెప్టంబర్)

వేశ్యాస్వీకారము।

౯౯. వేశ్యలుహిందువుల వర్ణవ్యవస్థకు లోపడిన వారు కారు. వారికివివాహము లేదు. పడుపు చేతనే జీవనము. నికృష్టవర్ణునితోడి సంపర్కమునఁదప్పఁబడుపు చేత వారికిజాత్యవమానము లేదు. వీరికిభర్తలేఁడు కాఁబట్టిపురుషవర్గమందు స్వీకారముకూడదు. వీరుతమద్రవ్యమిచ్చుటకయి తామేస్వీకరింపవచ్చును. వీరికి స్త్రీపరంపర ప్రధానము కాఁబట్టి పుత్రికాస్వీకారమే చేయవలసినది. వేశ్యపుత్రిక లేని పక్షమందే యీస్వీకారము చేయవచ్చును. దానికిఁబుత్రుఁడున్నాఁడు లేఁడని నిమిత్తము లేదు.

౧౦౦. తనభర్తనిమిత్తము వితంతువు స్వీకరించు బాలుఁడు భర్తయొక్క జీవితకాలమందు జనించికాని గర్భస్థుఁడైకానియుండవలెనని యక్కఱలేదు. (స. పం. ౧౮౪౯ అక్టోబర్ ౮; ౧౮౫౧ జూలై ౧౦)

స్వీకారకాలము।

౧౦౧. బ్రహ్మక్షత్రియవైశ్యులలో వడుగుచేసిన బాలునిస్వీకరింపఁకూడదు. (స. కో. ౧౮౧౪ రి. అ. నం. ౧౮లో తీర్పు)

ఉపనయనమునకు ముందు—

౧౦౨. ఉపనయన మనునది బాలునియొక్క బ్రహ్మచర్యాశ్రమప్రవేశమునకు గుఱుతు. ఉపనయనమనఁగాసమీపించుట. వేదాధ్యయనమునకై యాచార్యునిసమీపించుట

యని తాత్పర్యము. చౌలాదికర్మములు దీనికిముందు నడచు చున్నవి. ఇవినడచుట స్వీకారమునకుఁ బ్రతిబంధకముకాదు. ఈక్రియలుమరల స్వీకర్తచేయించుకోవచ్చునుగాని నడచినయుపనయనమును మానిపి మఱియొక యుపనయనమును జేయఁగూడదు. ఉపనయనము జరిగియుండెనా యదిస్వీకారమునకు బలవత్తరమయిన ప్రతిబంధకము.

౧౦౩. ఉపనయనము బ్రాహ్మణులకెనిమిదేండ్ల ప్రాయ ములోపల; క్షత్రియులకుఁ బదొకటిలోపల; వైశ్యులకుఁబండ్రెంటిలోపలను జరుగవలసినది. (స. కో. ౧౮౧౪ రి. అ. నం. ౧౮లో తీర్పు)

వివాహమునకుముందు — ౧౦౪. ఉపనయనము శూద్రులకులేదుగావున వివాహమునకుమునుపు స్వీకార మెప్పుడయినను జరుగవచ్చును. వివాహానంతరము కూడదు. (౧. ౯౧)

౧౦౫. విద్యార్థిదశమీఁదిది వివాహదశగావున సర్వవర్ణములయందును వివాహితుని స్వీకరింపఁగూడదనుట స్పష్టము. (౧. ౩౫, నోటును, ౯౧)

స్వీకారక్రమము। ౧౦౬. స్వీకారమునకు లిఖిత మక్కఱలేదు. బంధువులు వచ్చియుండవలెను. దేశాధికారులకుఁ దెలుపవలెను. హోమపారాయణములు నడపవలెను. ఈక్రియలు నడవకపోయినను స్వీకారమునకుహానిలేదు. దత్తహోమము తప్పఁగూడదు. దత్తహోమ దానపరిగ్రహములు ప్రకటముగాఁగావించుటయేపుత్రీకరణసిద్ధికి మిక్కిలి యావశ్యకము. (౧. ౯౩, ౯౭; ౨. ౧౧౪ పే)

౧౦౭. దత్తహోమము తప్పిపోయెనేని మొదటిమూఁడువర్ణములవారు చేయుస్వీకారము చెల్లదు. ఈనియమము శూద్రులకక్కఱలేదు.

౧౦౮. ఈయుగమందు నిరపేక్షముగా బాలునిచ్చుటవలె మఱియొక క్రియ స్వీకారమునకు దార్ఢ్యాపాదకముగాదు. వెలఁదీసి బాలునిస్వీకరించుట యశాస్త్రీయమనుట దానికుదాహరణము. ఇట్లుచేసిన స్వీకారము నిలువనేరదు. (౧. ౭౫; ౨. ౧౩౩, ౧౮౮—౧౯౩)

భార్యాసన్నిధానము।

౧౦౯. పుత్రీకరణమందు దాతృగ్రహీతలు ముఖ్యులు గాఁబట్టి వారిభార్యలు సహితము సమక్షమందుండవలెనని యక్కఱలేదని తీర్పుచేయఁబడినది. (స. కో. ౧౮౩౯ ది. అ. నం. ౮౬లో తీర్పు) దత్తహోమముపత్నులులేక జరుపఁగూడదు గావున వారుసమక్షమందుంటయావశ్యకము. (మితాక్షర ౨ కాం. ౧ అ. ౫ శ్లో)

నిషేధింపఁగూడని కాలము।

౧౧౦. పుత్రస్వీకారమునకు సమ్మతించినవాఁడు వెనుక దాని నిషేధింపఁగూడదు. (స. కో. ౧౮౫౯ స్పె. అ. నం. ౨౮లో తీర్పు)

౧౧౧. పుత్రస్వీకారము చెల్లదని వివాదము తెచ్చువారు కాలావధి శాసనము ననుసరించి యుక్తకాలమందుఁదగవు తేవలసినది. (స. కో. ౧౮౫౩ ది. అ. నం. ౪౯లో తీర్పు)

స్వీకృతాధికారము।

౧౧౨. స్వీకారముచేతనే స్వీకృతుఁడు పూర్వజనకునితో సంబంధము లేనివాడయి స్వీకర్తకు సర్వవిధములయందౌరసతుల్యుఁడవును. (౧. ౪౧, ౯౪)

౧౧౩. స్వీకర్తయొక్క దాయమందధికారము స్వీకృతుని సప్రతిబంధమైకాని యప్రతిబంధమయి కాని పొందును. (౧. ౯౭) అంతటితో నే స్వీకృతునకు జనకపితయొక్క దాయమందు సంబంధము నివర్తించును. (మనువు ౯. ౧౪౨)

౧౧౪. స్వీకృతుఁడు జనకపితయొక్క పురుషసంతతి నశించినంతట వానియాస్తిని బొందునని సదరుకోర్టుపండితులు చెప్పుదురు (౧౮౫౭ ఆగస్టు ౨౭) గాని యాసంప్రదాయము ఆకోర్టువారిచేతఁ ద్రోయఁబడి యున్నది. (స. కో. ౧౮౫౫ స్పె. అ. నం. ౧౯౨లో తీర్పు)

౧౧౫. పితంతువు స్వీకారము చేసినతోడనే దానిభర్తయొక్క ద్రవ్యము దానియొద్దనుండి స్వీకృతునిఁ జేరును. (౧. ౧౦౧)

౧౧౬. వేశ్యచేత స్వీకరింపఁబడిన పుత్రిక తనను స్వీకరించినతల్లియొక్క జీవితకాలమందు దాయమునకర్హురాలు కాదు. (స. కో. పం. ౧౮౫౭ సెప్టంబర్ ౧౦)

స్వీకృతునివివాహమునకు వావిలేనివారు

౧౧౭. స్వీకృతుఁడు సీకర్తయొక్క బంధువులలోఁదగనివావి వారిని వివాహము చేసికోఁగూడదు. (౧. ౪౧) తన జనకపితయొక్క బంధువులందు సహిత మట్టు చేయఁగూడదు. (నిర్ణయసింధువు)

దత్తునిపుత్రస్వీకారమునకు వావిలేనివారు!

౧౧౮. దత్తుఁడయినమాత్రమున సగర్భ్యత్వము మానదుగనుక వాఁడు తనసోదరుని స్వీకరింపఁగూడదు. (స. కో. ౧౮౫౮ స్పె. అ. నం. ౨౭లో తీర్పు) అట్లే దత్తుఁడుగాకమును

ఫు సగర్భ్యత్వ హేతువును బట్టి తనకుటుంబములో స్వీకరింపఁ దగని వానిని దత్తుఁడయిన వెనుక స్వీకరింపఁగూడదు.

౧౧౯. దత్తుఁడయినతోడనే జనకపితతో సంబంధము విడిచిపోయినది గావున వీని స్వీకారమశాస్త్రీయమయి చెల్లక పోయినను వీఁడు జనకపిత యొక్క దాయమందు భాగాధికారి గాని వానికి నురలఁ బుత్రుఁడుగాని కాఁబోఁడు. ఇరుపక్షములయందు వీఁడు దాయము పోఁగొట్టుకొని స్వీకర్తకుఁబోష్యమాత్రుఁడయి యుండును. (౧. ౮౨)

చెల్లుబడిలేని స్వీకృతుని యొక్క దశ.

౧౨౦. న్యాయ్యమయిన స్వీకారమొకసారి చేసినదియసిద్ధిగా నేరదు. (౨. ౧౧౧ కో)

స్వీకారము మాఱుపడదు.

౧౨౧. స్వీకారానంతర మౌరసుఁడు గలిగెనేని స్వీకృతునకు నాలవ పాలే వచ్చును. (ఎల్బర్లిగ్ ౭౧; మితాక్షర ౧. ౧౧, ౨౪) నాలవపాలనఁగా నౌరసునకువచ్చు పాలిలో నాలవపాలితో సరిపాలని యర్థము. దాయ మయిదుపాళ్లు చేసి యొకపాలు స్వీకృతునకును నాలుగుపాళ్లౌరసుఁడును జెందవలెనని తాత్పర్యము. (హై. కో. ౧౮౬౧ రి. అ. నం. ౫౧లో తీర్పు)

స్వీకారమునకు వెనుకఁబుట్టిన పుత్రుఁడు

౧౨౨. అనంతరము పుత్రులెందఱు గలిగినను మునుపు చెప్పినట్లే భాగము చేయవలసినది. (స. కో. పెద్దపం. ౧౮౫౩ సెప్టెంబర్ ౧)

## ౪. ప్రకరణము.

### రక్షకత్వము.

పోగండదశ। ౧౨౩. బాల్యదశ పదియాఱవ సంవత్సరమందు నివర్తించును. (౨. ౭౬ కో)

౧౨౪. ఆదశ పురుషులకట్లు స్త్రీలకు. (స. కో. పం. ౧౮౫౫ జూన్ ౧౯)

౧౨౫. బాల్యదశ పదునెనిమిదవయేఁటి తుదవఱకు గ్రహింపవలెనని కోర్టుఆఫ్ వార్డ్సు వారికృత్యములకయి దొరతనమువారిచేత విధియేర్పఱుపఁబడినది. ౧౮౦౪, ౫ రిగ్యులేషన్ ౪ ప్ర)

సంరక్షకులు। ౧౨౬. తండ్రి మొదట, వెనుకఁదల్లి, జ్యేష్ఠభ్రాత, తండ్రి బంధువులు, తల్లి బంధువులును, బాలునికి సహజముగా సంరక్షకులు. సంరక్షకుని నియమింపవలసియుండెనేని యదిసహజ సంరక్షకుని వారించుట కధికారముగల దొరతనమువారు చేయవలసినది. (చిన్నమెక్ నాటన్ ౧. ౧౦౩, ౧౦౪)

౧౨౭. రక్షణస్వాతంత్ర్యము తండ్రివంకవారికి ముందుతల్లివంకవారిదని సదరుకోర్టుపండితులుచెప్పిరి. (౧౮౫౯ మార్చి ౧౬) ఈయభిప్రాయమునకు సరియయిన శాస్త్రప్రమాణము లేదు, బాలునికిఁ బ్రియులైన బంధువులు సంరక్షకులుగా నుండవలయునను నొకవచనమునుబట్టి తల్లివంకవారుతండ్రివంకవారికంటెఁబ్రియులని సంభావించుకొని

బాలుని కీడు మేళ్లను దల్లివంక వారి యధీనములు చేయవలసి నదని చెప్పెదరు. ఈయభిప్రాయము సంభావితమే కాని బలవత్తరమైన హేతువులు కలదిగాదు. కాఁబట్టితండ్రివంక వారికి సహజస్వాతంత్ర్యముపోనేరదు.

౧౨౮. ఉన్మాదాదులచేతఁ దండ్రి యయోగ్యుఁడుగానిపక్షమందు బాలుని సంరక్షించుపని తల్లిది. (స. కో. ప్రొ. ౧౮౪౩ సెప్టెంబర్ ౧౮)

౧౨౯. ఊయిలుచేత సంరక్షకుని నియమించుటకు శాస్త్రమందు వచనముఁగానము. (౨. ౭౩ కో)

౧౩౦. తన ద్రవ్యమునకు సంబంధించిన యేకార్యము గాని బాలుఁడు చేసినదిచెల్లనేరదు. (మితాక్షరవ్యవహార కాండము)

బాలునిచేఁతలు।

౧౩౧. బాలునియాస్తికి హానికరమైన కార్యముగాని వాఁడచ్చుకోవలసినదానికిఁ జేయు కార్యముగాని చెల్లనేరదు. వాని యక్కఱకుఁగాని లాభమునకుఁగాని చేసిన కార్యము చెల్లును. (కుల్లూకభట్టీయమందు మనువు ౮. ౨౭)

బాలునికనుకూలమైన కృత్యములు।

౧౩౨. తగిన యీడు రాకమునుపు బాలుఁడు తనతండ్రి ఋణమునకయి యుత్తరవాది కాఁడు. (౨. ౨౭౯ కో) అయినను బాలకులు తమసంరక్షకులద్వారా తగవు తేను ఆడను వచ్చునని కోర్టువారొప్పుకొనియెదరు. (౨. ౮౦ కో)

బాలునిపూఁటకాఁపు తనము।

౧౩౩. సముదాయ ద్రవ్యమందు బాలునిభాగమునకు హానిప్రాప్తించు పక్షమందు దానికైసంరక్షకుఁడు వివాద

సముదాయద్రవ్య మందుబాలుని భాగము।

ము జరుపవచ్చును. లేనిపక్షమందుఁగూడదు. (స. కో. ౧౮౫౦ రి. అ. నం. ౪౯ లో తీర్పు)

స్త్రీ పరతంత్రురాలు। ౧౩౪. స్త్రీలకు సర్వదాపారతంత్ర్యమేకాని స్వాతంత్ర్యముతగదు. (౧. ౨౪౪; చిన్నమెక్‌నాటన్ ౧. ౧౦౪)

కొన్నిజాతులందుదీని కపవాదము। ౧౩౫. చాకలి, గొల్ల, యీడిగ, గాండ్ల, నట్టువులయందును, వీరివంటి కర్మోపజీవులయందును గుటుంబ సంరక్షణకుపకరించుస్త్రీలొడంబడికలు చేయవచ్చును. అదికుటుంబనిమిత్తమయియుండవలె. ఆయొడంబడికలకు భర్తకట్టుపడవలసినది. (స్మృతిచంద్రికయందు యాజ్ఞవల్క్య నారదవచనములు)

పెండ్లిలేని స్త్రీ। ౧౩౬. పెండ్లిలేని స్త్రీయెంతయీడుగలదైనను దండ్రియొక్క రక్షణమందుండ వలసినది. తండ్రిలేనిపక్షమందు వానిజ్ఞాతుల సంరక్షణమం దుండవలసినది. (చిన్నమెక్‌నాటన్ ౧. ౧౦౪)

పెండ్లియయిన స్త్రీ। ౧౩౭. పెండ్లియయిన స్త్రీతనభర్తసంరక్షణమం దుండవలసినది. అతఁడు లేనిపక్షమందుఁ బుత్ర, పౌత్ర, ప్రపౌత్ర, భర్తృజ్ఞాతి, స్వపితృ మాతృ సంబంధులరక్షణమందుండవలసినది. చిన్నమెక్‌నాటన్ ౧. ౧౦౪)

బాలద్రవ్యమునకు రక్షకురాలు। ౧౩౮. బాలద్రవ్యమందుఁగార్య నిర్వాహకురాలయిన స్త్రీతనయొక్క సంరక్షకుల యాజ్ఞకులోపడియుండవలసినది. (చిన్నమెక్‌నాటన్ ౧. ౧౦౩) ముదియీడువచ్చిన స్త్రీచేయుకార్యములకు దానిసంరక్షకుని సమ్మత్యసమ్మతులుకోర్టువారు పాటించు నాచారము లేదు.

# ౫. ప్రకరణము.

## స్వామ్యం.

౧౩౯. స్థావరమనియు, జంగమమని, ద్రవ్యము ద్వివిధము. భూ, నదీ, గృహ, తటాకములు, మొదలయిన యిట్టిపదార్థములు స్వరూపముతో స్థానాంతరము పొందింపరానివి స్థావరములనఁబడును. ఇతరములయిన వస్తువులన్ని జంగమములనఁబడును. విక్రయము చేతఁగాని దానము చేతఁగాని శాశ్వతపుగుత్త చేతఁగాని సంపాదింపఁబడి శాశ్వతభోగ్యములయిన భూములు స్థావరములనఁబడును. శాశ్వతశాసనము చేత లభించిన రుసుములును, వచ్చుబళ్లును, స్థావరములని చెప్పఁబడును. వీనికే నిబంధములని పేరు. కుదువలు, గడువు గుత్తలును, జంగమములని చెప్పఁబడును. సస్యములు, వనమృగములు, పక్షులు, మీనములును, శాశ్వతభోగ్యమయిన పదార్థముతోఁ గలిసియుండియు, జంగమములని చెప్పఁబడును.

స్థావరజంగమశబ్ద నిర్వచనము.

౧౪౦. ద్రవ్యము పిత్రార్జితమని స్వార్జితమని మరల రెండువిధములవిభాగింపఁబడియుండు. పితృద్రవ్యముగాని దానిచేత సంపాదించినదిగాని జంగమస్థావరములందేదయినను పిత్రార్జితమనఁబడు. పితృద్రవ్యనిరపేక్షముగా స్వప్రయాసముచేత సంపాదించినద్రవ్యము స్వార్జితమనఁబడును.

స్వార్జితములు.

౧౪౧. పితృద్రవ్యమందుండి యిచ్చినదానికి మారుగా కయారకవచ్చినద్రవ్యము స్వార్జితము. (ఎల్బర్లింగ్ ౯౨)

౧౪౨. పెద్దలు పోఁగొట్టిన ద్రవ్యము పితృద్రవ్యసాహా

య్యము లేక స్వప్రయాసముచేత మరల సంపాదింపఁబడే నాయది స్వార్జితము. ఈపునరార్జనము దాయాదులయను మతి పొందికాని వారుదానియందుఁ దమసంబంధముమాని నారని తెలిసికొని కాని చేయవలసినది. ఆద్రవ్యమును సం పాదించు యత్నము దాయాదులకుఁ గలదని యెఱిఁగియు వారికంటెముందు సంపాదించెనాయిదివారిని మోసపుచ్చు టేయని భావింపవలెను. ఇట్లుసంపాదించినది దాయాదుల పొత్తుల ద్రవ్యముగాని స్వార్జితముగా నేరదు. (౧. ౧౯౫. ౨౧౭)

౧౪౩. పితృదత్తమయిన విద్యచేతవచ్చిన ద్రవ్యముస్వ ప్రయాస లబ్ధమైనను పైతృకద్రవ్యముచేత సంపాదితమని యెంచఁబడును. (తిరునల్వేల్లి జి. కో. పం. ౧౮౨౧ ఆగస్టు ౧౭) ఈశాస్త్రార్థము ఋజువైనదికాదు కాఁబట్టి న్యాయము నకు యోగ్యతకువిరుద్ధమయినయిదియాచారమునకుఁదగదు.

విభక్తావిభక్తద్రవ్యము।

౧౪౪. పైతృక ద్రవ్యము విభక్తమని యవిభక్తమవిద్వి ప్రకారము.

స్త్రీధనము।

౧౪౫. మఱియు వివాహమయినదానికిఁగాని కానిదా నికిఁగానిస్త్రీకిచ్చినధనమునకుఁగాను విశేషశాస్త్రమేర్పడి యున్నది. దానికిస్త్రీధనమనిపేరు. ఈపేరుయౌగికముకాఁ బట్టియర్థము స్పష్టము. పతి తద్బంధు స్వబంధు పితృదత్తము గాని తనంతదొరకినదిగాని కనిపట్టినదిగాని స్త్రీధనమనఁబ డును. (మితాక్షర ౨. ౧౧. ౧—౩)

౧౪౬. తనప్రయత్నముల చేతఁగాని తనచుట్టాలుకాని వారిచ్చుటచేతఁగాని వచ్చినద్రవ్యము సమస్తముతనభర్తదిగాని తనదిగాదు. స్మృతిచంద్రిక)

౧౪౭. వాడుక చొప్పున నయిదుదినముల పెండ్లిజరిగినప్పుడు పయిఁడి ముడుపుమొదలుకొని భర్తయొక్క గృహముప్రవేశించువఱకుఁ దల్లిదండ్రులుతోఁ బుట్టువులును నిచ్చినస్థావరజంగమ ద్రవ్యము సౌదాయిక మనఁబడును. దానియందధికారము పెనిమిటికిఁగాని సంతతివారికిఁగాని నిమిత్తములేక యామెకేగలిగియుండును. (మితాక్షర ౨. ౧౧, ౫; సరస్వతీవిలాసము; వ్యవహారమయూఖమందు ౪. ౭. ౧; ౪. ౧౦. ౮)

౧౪౮. సంబంధములేక మునిఁగిపోయిన ద్రవ్యమును మరలసంపాదించుకొనుట కింతకాలములోఁ దగవు తేవలసినదని హిందూ శాస్త్రము విధించిన కాలావధి యింగిలీషుదొరతనమువారిచేతఁ ద్రోపడిపోయినది. (౧౮౫౯ సం|| ౧౪ వ ఆక్టు)

కాలావధిని బంధనము!

## ౬. ప్రకరణము.

### వినియోగము.

స్థావరద్రవ్యమందుఁదండ్రికిఁగల స్వాతంత్ర్యము।

౧౪౯. పుత్రులతో విభాగించుకోని తండ్రి తనపిత్రార్జితముగాని స్వార్జితముగాని స్థావర ద్రవ్యమును బుత్రులయనుమతిలేక వినియోగింపఁగూడదు. (౨. ౯, ౧౧ కో) పుత్రులులేనిపక్షమందు వారిపుత్రపౌత్రుల యనుమతి కావలసినది. వీరుతమతండ్రితో సమానాధికారులయి యుందురు. (మితాక్షర ౧. ౧. ౨౭)

౧౫౦. వీరుబాలకులయి యుండఁగానే త్రోయఁగూడని యక్కఱవచ్చినప్పుడు వారియనుమతి యున్నట్లుభావింపఁబడును. (౧. ౨౦)

౧౫౧. శూద్రపిత చేరుగొండి కొడుకులు సంతతివారితోఁజేరినవారైనను వానిజీవితకాలములో వారికి భాగము గలుగుటవానియిచ్ఛాధీనము గనుక వారిసమ్మతిలేకయే వినియోగింపవచ్చును. (స. కో. పం. ౧౮౬౨ మార్చి ౮)

౧౫౨. పుత్రసంతతి లేనివాఁడు పిత్రార్జితమును గాని స్వార్జితమును గాని స్థావరద్రవ్యమును తనపాలివారికిఁ బ్రతికూలముగాఁదన యిచ్ఛకువచ్చినట్టు వినియోగింపవచ్చును. (౨. ౪౩౬కో)

జంగమద్రవ్యమందు—

౧౫౩. పిత్రార్జితమందుఁగాని స్వార్జితమందుఁగాని జంగమద్రవ్యమందుఁ బుత్రసంతానము కలవాడైనను లేనివాఁడైననుదానే సర్వస్వతంత్రుఁడు. (మితాక్షర ౧. ౧. ౨౭)

౧౫౪. పోష్యుల పోషణముకయి పుత్రికల వివాహముకయి వెచ్చమావశ్యకముగనుక దానికిఁజాలినంత ద్రవ్యమునిలుపుకోక స్థావరమునుగాని జంగమమునుగాని ద్రవ్యమును వినియోగించుట చెల్లదు. (౧. ౧౮, ౧౯; స. పం. ౧౮౫౨ ఏప్రల్ ౧౦, ౨౬—స. కో. ౧౮౬౦ స్పె. అ. నం. ౧౧౭ లోఁదీర్పు)

కుటుంబపోషణము నకుఁ జాలినంత యుంచుకోవలెను।

౧౫౫. తండ్రిగొడుకుఁదప్ప నితర దాయాదులందఱుపరస్పర సమ్మతిచేత స్థావరమునుగానిజంగమమునుగాని ద్రవ్యమును వినియోగింపవచ్చునుగాని పరస్పరసమ్మతిలేక చేసిన వినియోగము చెల్లదు. (౧. ౧౯)

దాయాదులచేతవినియోగము।

౧౫౬. దాయాదుఁడు తనకుమిక్కిలి యిక్కట్టు కలిగినపుడుపొత్తుల ద్రవ్యమందుఁగొంతవిక్రయింప వచ్చునుగాని నిర్దేశించి విక్రయింపఁగూడదు. (స. కో. ౧౮౫౯ స్పె. అ. నం. ౧౨౩ ౧౮౩ లోఁదీర్పులు) కొన్నవాఁడు విక్రయించినవాని భాగముతోఁదృష్టిఁ బొందవలసినది. అంతకుఁ దగవు తేవచ్చును.

౧౫౭. దాయాదులు బాలకులయి యుండునప్పుడు తమకయియవశ్యముగా జరుగవలసిన పనులకుఁగాని స్పష్టమయిన తమప్రయోజన మునకుఁగాని యొప్పుకోవలసినది. (౧. ౨౦౩)

౧౫౮. విభాగానంతరము దాయాదు లెవ్వరుగాని యొండొరుల కెఱుక చేయకయే తమతమ భాగమును వినియోగింపవచ్చును. (స. కో. పం. ౧౮౩౩ నవంబరు ౬) గా

విభక్తులచేత—

ని ౧౪౯—౧౫౪ ప్రకరణములందు( జెప్ప(బడిననిబంధనలను మీఱ(గూడదు.

వితంతువుచే త—

౧౫౯. వితంతువు తనభర్తవలనవచ్చిన ద్రవ్యమును జీవించువఱకనుభవింపవచ్చును. అనంతరమది యుత్తరాధికారులను జెందవలసినది. (౧. ౨౪౬)

౧౬౦. వితంతువు తనభర్తయొక్క ఋణములకు(గాని తనజీవనమునకు(గాని పుత్రికల వివాహమునకు(గాని భర్తయొక్క యాత్మోజ్జీవనమునకు(గాని చేయువెచ్చమాస్తిచేత జరుపవలసినది కా(బట్టి యక్కఱయినప్పుడు దానికయిస్థావరద్రవ్యమును వినియోగింపవచ్చును. తక్కినవిషయమందు( దనముఖ్యజ్ఞాతుల యనుమతిలేక చేసినవినియోగము చెల్లనేరదు. (౧. ౨౪౬, ౨౪౭; ఎల్ బర్లిజ్ ౭౪)

౧౬౧. ఇందులకుదాహరణము. పుత్రికలు దౌహిత్రులునుండ(గా వితంతువు పుత్రికలయనుమతిచేతనే వినియోగము చేయ(గూడదు. దౌహిత్రులసమ్మతియును నావశ్యకము. (స. కో. పం. ౧౮౫౧ ఏప్రల్ ౩)

౧౬౨. ఆమెకుజంగమద్రవ్యమందధిక తరమయిన స్వాతంత్ర్యము గలదు. (౧. ౨౪౭, ౨౪౮) తానుస్వతంత్రముగాజంగమద్రవ్యమువినియోగింపవచ్చును. (స. కో. ౧౮౪౯ స్పె. అ. నం. ౫ లో(దీర్పు)

౧౬౩. దూరపు దాయాదులు సహితము లేని పక్షమందు( దనద్రవ్యమెట్లువచ్చినదిగాని యెట్టిదిగాని వితంతువు యథేచ్ఛముగా వినియోగింపవచ్చును.

౧౬౪. పండితులుచెప్పినట్టేనిస్సందేహముగా శాస్త్రసం బునునున్నది. దానినొప్పుకొని సదరుకోర్టువారు ౧౮౫౭ సంవత్సరము ౧౦౩—౧౩౬ నంబరుల యప్పీలులలోఁ దీర్పు చెప్పియున్నారు. ఆతీర్పులు పిమయప్పీలులో రాణిగారిప్రివి కౌన్సల్ తోఁ జేరినజ్యూడిషియల్ కమిటివారు ౧౮౬౧ సం వత్సరము డిసంబరునెల ౨౧ తేది చేసిన తీర్పుచేతఁ ద్రోయఁ బడినవి. (కావలివెంకట నారాయణప్పమీఁద బందరు కలెక్ట రు తెచ్చిన వివాదము)

వితంతువు కొంతవడిన యధికారముకలది. సన్యాసినివలె జీవింపఁదగినది. ఆత్మభోగార్థ మిచ్చవచ్చినట్టు తన ద్రవ్య మును వినియోగింపఁ గూడదు. తక్కిన హిందూస్త్రీలవలెఁ బారతంత్ర్యమును బొందియుండ వలెనుగాని స్వాతంత్ర్య మునుబొందఁదగదు. బంధువుల పరోక్షమందు రాజరక్షణ మందుండవలసినది. ఎప్పుడును నిర్బంధింపఁబడిన యాస్తి క లదిగా నుండవలసినది. ఆమెను నిర్బంధించు సంతతివారు లేనప్పు డాయధికారము రాజుదిగనుక నస్వామిక ద్రవ్యము నందు రాజునకుఁగల స్వాతంత్ర్యమునకు విరుద్ధముగా సం తులేని వితంతువు వినియోగింపఁ గూడదని చెప్పియున్నారు.

రాజు దాయాదులు లేని ద్రవ్యమందుఁ దనకుఁగల యధి కారమునుబట్టి యస్వామిక ద్రవ్యమును స్వాధీనపఱచికొనవ చ్చునుగాని యంతకంటె హెచ్చుకార్యములు చేయునధికా రము వహించి తానొకదాయాదుఁడుగా ద్రవ్యము వినియో గింపఁగూడదని ద్రవ్యాధికారితోనే వివాదము పెట్టుకొనవ

చ్చుననుట క్రొత్త మతముగానున్నది. అస్వామిక ద్రవ్యము నాక్షేపించు నధికారముదకk పక్షవాదముగాను శాస్త్రాభిప్రాయమునకు విరుద్ధముగాను నుండెడు ప్రివికౌన్సల్ వారి తీర్పు శాస్త్రమునుగొని పరీక్షించునప్పుడు నిలువదు.

దాయమనఁగా బంధుత్వమునుబట్టి వచ్చిన ద్రవ్యము. అదాయికద్రవ్యమనఁగా దాయాదులులేని ద్రవ్యము. అదిరాజును జెందునని మితాక్షరయందుఁ జెప్పఁబడియున్నది. (మితాక్షర ౧. ౧. ౨; ౨. ౧. ౨౭) మఱియు వితంతువు దాయాదులసమ్మతిలేక దానవిక్రయాదులచేత స్థావరద్రవ్యము వినియోగింపఁ గూడదని మాధవీయమందు బృహస్పతి వచనమున్నది. ఆయర్థమే మయూఖస్మృతి చంద్రికలయందుఁ జెప్పఁబడియున్నది. గనుక వితంతువు వినియోగింపఁగూడదని నిషేధించినది దాయాదులకొఱకుఁగాని రాజుకొఱకుఁ గాదు. అనఁగా మొదటిద్రవ్యాధికారికి బంధువులై వాని యాస్తియందు స్వత్వము పొందఁదగిన వారికొఱకుగాని యన్యుఁడుగావచ్చి యదాయికద్రవ్యముమాత్రమే పొందునధికారము గలవానికొఱకుఁగాదనిస్పష్టముగా నేర్పడుచున్నది.

భార్యాద్రవ్యము।

౧౬౫. తనభర్త జీవించియుండఁగా ద్రవ్యమందు భర్తకే యధికారము. సౌదాయికముగా వచ్చిన ద్రవ్యముమాత్రము స్త్రీ తనయిచ్ఛకువచ్చినట్లు వినియోగించుకోవచ్చును. (స్మృతిచంద్రిక)

౧౬౬. సౌదాయికద్రవ్యముచేతఁ జేయఁగోరిన ఋణ

ప్రయోగాది వ్యాపారములు తనభర్తచేతఁ జేయింపవలసిన
ది. అతఁడామె యిష్టమవశ్యము నెఱవేర్పవలసినది. (సరస్వ
తీ విలాసమందు)

౧౬౭. పెండ్లిగాని స్త్రీలు తమకుఁ జేరిన స్థావర జంగ
మ ద్రవ్యములను సంరక్షకుని యనుమతిలేక వినియోగింపఁ
గూడదు.

పెండ్లిగాని స్త్రీచేత వినియోగము।

౧౬౮. బుద్ధిమాంద్యము చేతఁగాని యున్మాదము చేతఁ
గాని బాల్యముచేతఁగాని ముదిమి రోగములవలనఁ గలిగిన బు
ద్ధివైకల్యము జేతఁగాని నిర్బంధముచేతఁగాని కామముచేతఁ
గాని ద్వేషముచేతఁగాని చిత్తవశత లేనివాఁడు చేయు విని
యోగము చెల్లనేరదు. (౧. ౨౩)

చిత్తవశతలేనివారిచేత—

## ౭. ప్రకరణము.

### ఉయిల్లు.

ఉయిలు ధర్మశాస్త్రమందులేదు।

౧౬౯. ఉయిలుచేత ద్రవ్యమును వినియోగించు నధికారము ధర్మశాస్త్రమందుం గానంబడలేదు. ఉయిలను సాధనమునకు ధర్మశాస్త్రమందు వాచకములేదు. ఈవిషయము ప్రామాణికులయిన సర్ ఉల్లియంజోన్స్, మేస్టర్ కోల్ బ్రూక్, మేస్టర్ ఎల్లిస్, సర్ తామస్ స్ట్రేంజి, వీరలేకకంఠముగాం జెప్పుచున్నారు. (౧. ౨౫౪, ౨౫౫; ౨. ౪౧౯, ౪౨౭, ౪౩౧)

ఉయిలనావశ్యకము।

౧౭౦. ధర్మశాస్త్రమందే ద్రవ్యవినియోగముకయి కావలసిన నియమము లేర్పడియున్నవి కాంబట్టి యుయిలు వ్రాయుట కెడములేదు. ఆస్తియనుక్రమమునదూరబంధువులకుం జేరవలసినదని, తుదకు దొరతనమువారికిం జేరవలసినదని, పోష్యులైన వారందఱియొక్క జీవనమున కేర్పడవలసినదనియు ధర్మశాస్త్రమూర్జితముగ నిర్ణయించుచున్నది. (౧, ౨౫౪, ౨౫౫)

౧౭౧. ధర్మశాస్త్రవిరుద్ధమయిన యుయిలుచెల్లదు. అవిరుద్ధమక్కఱలేదు. (౨. ౪౨౧ ౭)

ఉయిలుశాస్త్ర సిద్ధాంత విరుద్ధము।

౧౭౨. హిందువుల యాచారము ననుసరించి వ్యవహరింపంబడు ధర్మశాస్త్రమునకువిరుద్ధముగా నుయిలుచేతహిందువుదాయాదత్వము తొలగింపనేరదు. (౧. ౧౩౦)

౧౭౩. ఇంగిలీషు దొరతనమువారివిషయముచూచువా రికి సందేహముకలుగునట్లు చేసిపెట్టిరి. ఉయిలువిషయము ధర్మశాస్త్రమందు లేదని తెలియక చేసినపూర్వపు చట్టము నుదిద్దుకొని యిప్పుడు ధర్మశాస్త్రమందుయిలు చెప్పఁబడిన దికాదనియొప్పుకొనిరిగాని ఎంతదూరము ధర్మశాస్త్రానుసా రియయి యుండునంతమాత్రము దప్పఁగడమచెల్లదనిచెప్పిరి. (౧౮౨౯, ౫ రిగ్యులేషను)

దొరతనము వారు —

౧౭౪. ప్రివికౌన్సల్ వారు, సూప్రీంకోర్టువారు, సదరు కోర్టువారు - ఈముఖ్యకోర్టులవారు హిందువుల యుయిల్లనంగీకరించెదరు. (౧. ౨౬౮ మూర్లి ౧. ౬౧౨—౬౧౮)

ఉయిలుకోర్టువారు సమ్మతించెదరు।

౧౭౫. ఎవ్వఁడుగాని తనజీవించునపుడు స్వతంత్రుఁడయి యియ్యఁదగినది యుయిలువ్రాసి యేలయియ్యరాదను యుక్తిచేత హిందువుల యుయిల్లొపాటికిమాత్రము చెల్లుననియొప్పుకోఁబడియె. (౨. ౪౩౬; ౪౪౫ కొ. సదర్ లాన్డు)

ఉయిలువ్రాయు నధికార వ్యవస్థ।

౧౭౬. హిందువులుయిలువ్రాసి తమద్రవ్యమును వినియోగించు విషయములో మద్రాసు సదరుకోర్టువారు పలు విధములుగాఁ దీర్పులు చేసియున్నారు.

ఉయిలునకనుకూలమయినతీర్పులు।

ఉయిల్లనాదరించి చేసినతీర్పులు రెండుగలవు. మొదటిది. ౧౮౨౪ సంవత్సరము ౩ నవంబరుగల స్పెషలప్పీలులోఁ జెప్పఁబడినది. అప్పటిలో వివాదగ్రస్తమయిన ద్రవ్యము స్వార్జితమయినందున నుయిలువ్రాసినవాఁడు తనజీవితకాల

మందు వినియోగింపఁ గూడినదికాఁబట్టి కోర్టువారాజ్ఞితప
జేచిరి. రెండవది - ౧౮౭౯ సంవత్సరము ౭౩ వ నంబరుగల
రిగ్యులరప్పీలులోఁ జెప్పఁబడినది. ఇదినిస్సంశయముగాశా
స్త్రజ్ఞానములేని యొకజడ్జిచేసిన తీర్పు. అతఁడు ప్రమాణ
ములనుగొని ప్రవర్తింపఁ జూచెనుగాని యవిపరస్పరవిరుద్ధ
ములుగాఁగనఁబడెను. కాఁబట్టి పండితుల యభిప్రాయము
ను ప్రివికౌన్సలు వారంగీకరించిన కలకత్తాసూప్రీంకోర్టు
వారితీర్పును నవలంబించి భార్యకువిరుద్ధముగా ధర్మకర్తలను
నేమించినట్టి వివాదగ్రస్తమునయినట్టి యాయుయిలును నా
దరించెను. ఆపండితులే వెనుకనుయిలులో వ్రాసినప్రకార
ముజీవితకాలమందు ద్రవ్యవినియోగము చేయునధికారము
తనికిఁగలదాయని యడిగినట్టు భావించుకొని మేమభిప్రాయ
ముచెప్పితిమని సమాధానముచెప్పి యుయిలు వ్రాయునధికా
రము హిందువులకు లేదనిచెప్పిరి.

హిందువులు తమజీవితకాలమందు ద్రవ్యవినియోగము
నకుఁదమకుఁగల యధికారమునకు హెచ్చగు నధికారమువ
హించి యుయిల్లువ్రాయునెడ వారియుయిల్లు సమ్మతింపఁ
బడునని సదరుకోర్టువారు చేసినతీర్పులు మూఁడుగలవు - అ
వి ౧౮౬౦ సం॥ ౧౬ నం. అప్పీలులోను ౧౮౭౭ సం॥ ౬౫
నం. విశేష అప్పీల్ లోను ౧౮౬౦ సం॥ ౩౫౨ నం. విశేష
అప్పీలులోను జేయఁబడినవి.

ఉయిల్లవిషయమై మద్రాసు సదరుకోర్టువారు చేసిన తీ
ర్పులమీఁద - ప్రివికౌన్సలువారు చేసినతీర్పులు రెండుగలవు.

మొదటితీర్పులో సదరుకోర్టువారు ౧౮౫౪ సంవత్సరము ౩ నంబరు విశేష అప్పీలులో నాదరించినయుయిలు ప్రతిషేధింపఁబడినదిగాని యాతీర్పుమీఁదఁ జేసినయప్పీలుగాదు. సదరుకోర్టువారు తీర్పుచేసినవెనుక నుయిలువ్రాసినవానికిఁ దనజీవితకాలమందు భార్యసమ్మతిలేక కొంతద్రవ్యవినియోగము చేయునధికారము గలదాలేదాయని క్రొత్తగాఁ దగవు తెచ్చినంతట ముందుచెప్పినప్రకార ముయిలు కొట్టువడినది. (మూరు ౭. ౫౪) ౧౮౪౯ సంవత్సరము ౪౩ నంబరు అప్పీలులో మద్రాసు సదరుకోర్టువారు చేసిన తీర్పంగీకరించి చేసినది రెండవతీర్పు. ఈతీర్పులోఁ బ్రివికౌన్సలువారింగ్లాండు దేశమందుఁ జెప్పఁబడిన యుయిలునకు హిందువులలో వాచకములేదని సర్ తామస్ స్ట్రెంజిదొరగారు చెప్పినవాక్యమునుదహరించి వాచకములేని మాత్రముననె తనమరణానంతరము ద్రవ్యము వినియోగించురీతిట్టిదని యొకఁడువినియోగించు శాసనములు సయితముబొత్తిగా లేవనియెంచుట సరికాదనివాదించి పిమ్మటబంగాళములో నుయిల్లంగీకరింపఁబడియున్నయాచారము నుదహరించి మద్రాసులోసయితము పిత్రార్జితముగాని ద్రవ్యము నుయిలుచే వినియోగింపవచ్చునని యేర్పడియున్నట్లు సంభావించుకొని యాయేర్పాటుప్రకృతపు వివాదమందు దూషింపఁబడదుకాఁబట్టి హిందువుల యుయిలునకుఁ జెల్లుబడికలదని తీర్పుచేసిరి. (మూ. ౩౪౫)

పరీక్షించునపుడీతీర్పు నిజముగా నిలువనేరదు. ప్రివికౌన్సలువారు తలఁచిన సాధనములుండినపక్షమందు హిందువు

లకుఁగల యనేకస్మృతులయందు వానిజాడఁగనఁబడియుం
డును. అట్టిసాధనమునకుఁ బేరులేకపోదు. మఱియు మద్రా
సునందంతటాయుయిల్లు వ్రాయు నాచారము కలిగియున్నద
ని ప్రివికౌన్సలువారు చెప్పినవచనము సప్రమాణము కాదు.
తొంటి సూప్రీంకోర్టువారి యధికారమునకులోనయి యు
న్న ౨౭ చదరపు మయిళ్ల ప్రదేశమందుఁగల యాచారముఁబ
ట్టి వారట్లువ్రాసి యుండవచ్చునుగాని రాజధాని క్రింది
౧౧౫౦౦౦ చదరపు మయిళ్ల ప్రదేశమందుఁగల యాచార
మునుబట్టి చెప్పియుండరు.

అయినను హిందూధర్మశాస్త్రానుసారియగు నెకసాధ
నముగలదది విచారణీయము.

ప్రాణాపదయందుఁ జేసినదానము దానముకాదని నార
దవచనముకలదుగాని యదిధర్మకార్యములకై చేసిన దాన
మునుబట్టి చెప్పినదికాదు. ప్రాణాపదయందుఁగాని సుఖస్థితి
యందుఁగాని యుండునప్పుడు ధర్మార్థముచేసిన దానవాగ్దా
నములు నెరవేఱకముందు దాతగతించినపక్షమందు వానిపు
త్రుఁడు వానినెరవేర్పవలసినదని కాత్యాయనవచనముగల
దు. (మితాక్షరయందు దత్తాప్రదానికము)

ఈప్రకారము హిందూధర్మశాస్త్రమందు మరణానంత
రము వినియోగింపఁదగిన దానమిట్టిదని వ్యవస్థయిట్టిదని యే
ర్పడియుండుటయేకాక యావ్యవస్థమీఱిన యట్టిదానముచే
యఁగూడదని స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. ధర్మకార్య
ములకై యట్టిదానముచేయవచ్చునుగాని యితరకార్యముల

కుఁగాదు. ఆదానము నెరవేర్చుట సహితము పారమార్థికము గాని వ్యావహారికము కాదు. ఈధార్మికదానము దప్ప మరణానంతరము నెరవేర్పవలసినది నియోగించి చేయు దానము దానము కాదు.

ఈప్రకారము శాస్త్రమున్నదని పరిశీలింపకనో తెలియకనో మీఁదఁ జెప్పిన తీర్పులు ప్రివికౌన్సలు వారు చేసియున్నారు. జీవించియుండునప్పుడు చేయఁదగిన కార్యము గతించిన వెనుకఁ జేయునట్లు లేల నియోగింపఁగూడదను సంభావన చే వారట్లు తీర్పు చేసియున్నారు ఆసంభావన సహితము నిర్హేతుకము. అది సర్వస్మృతులకు సాక్షాద్విరుద్ధము. దానికనుకూలముగా నొకవచనమును గానము. జీవించియుండునప్పుడు కొంతయధికారము హిందువునకుఁగలదు. వాఁడు గతించిన వెనుక వానియాస్తి యనుభవింపనలసినది యిట్టివిధమని శాస్త్రము నియోగించుచున్నది. శాస్త్రమందుఁ జెప్పఁబడిన వారికంటె నితరులను జెందునని యెచ్చటను జెప్పియుండలేదు. ఇంగ్లాండు దేశమందు జ్యేష్ఠపుత్రునకుఁ జేసియున్న చట్టమందువలె దాయాధికారము వివరముగా నిర్ణయింపఁబడుచున్నది. ఆనిర్ణయమును మీఱుట శాస్త్రాతిక్రమణసమానము.

ఈహేతువులనుబట్టి యొకసమయమునందు మద్రాసుసదరు కోర్టువారు హిందువులకు నుయిలు వ్రాసియిచ్చు నధికారము లేదని తీర్పుచేసియున్నారు.

౧౭౭. ఉయిలు శాస్త్రసమ్మతముగాదు. ఎవ్వఁడుగాని తానుజీవించునపుడు దానము చేయవచ్చునుగాని ప్రతిగ్రహ

ఉయిల్లనంగీకరింపఁ గూ

డదనుటకుఁ దీర్పులు।

ము లేనిపక్షమందా దానము దానముగాదు. అవసానదశయం దున్న ద్రవ్యము సమస్తము మరణించినవాని యుత్తరాధికారులకుఁ జేరవలసినది. కావునహిందువుల యుయిల్లుచెల్ల నేరవు. (స. అ. ప్రొ. ౧౮౫౫ జూలాయి ౩౦) ఉయిల్ల నంగీకరింపఁగూడదనుటకుఁ దీర్పులు. (స. కో. ౧౮౫౮ స్వె. అ. నం. ౧౬౯లో ౧౮౫౯ స్వె. అ. నం. ౧౦౭లో తీర్పులు.)

౧౭౮. పురుషుఁడు తనద్రవ్యమందు భార్యకు జీవనాంశమిచ్చి తక్కినయంశమామె జోలిమాన్చి యథేచ్ఛముగా వినియోగింపవచ్చును. తనమరణముతోనే తనద్రవ్యమందధికారము భార్యది గావునఁదనపరోక్షమందిది యిట్లువినియోగింపుమనినినియోగింపఁగూడదు (స. అ. పం. ౧౮౫౨ జూలాయి ౧౯)

౧౭౯. సోదరుని కొడుకునకుఁ బ్రతికూలముగా నల్లునికి వ్రాసియిచ్చిన యుయిలుచెల్లదు. (సం. కో. స్వె. ౧౮౬౧ అ. ౬౫౯ నంబరులోతీర్పు)

౧౮౦. బాలుఁడయిన కొడుకునకుఁ దండ్రిసంరక్షకుని నియోగించుటచెల్లదు. వానిద్రవ్యాధికారము వానిమరణముతోనే యుత్తరాధికారులను జెందుచున్నది. (స. కో. పం. ౧౮౫౭ మార్చి ౧౨)

## ౮. ప్ర క ర ణ ము.

### సొమ్ములోఁజేయవలసినవ్యయములు.

౧౮౧. న్యాయ్యములయిన ఋణములకు మాసిక షా ణ్మాసికాబ్దిక శ్రాద్ధములకుపనయ నాంత క్రియలకు వివాహ ములకు భరణమునకుఁ జేయవలసిన వ్యయములాస్తిలోనివి. (౧. ౧౬౬, ౧౭౧)

సొమ్ములోఁ జేయ వలసిన వ్యయముల రీతి।

౧౮౨. పితృద్రవ్యము పొందికాని పొందకకాని పుత్రుఁడు తండ్రియొక్కఋణమవశ్యముతీర్పుట శాస్త్రచోదితము. (౧. ౧౬౭) ఈవిధి పారమార్థికముగాని వ్యవహారయోగ్యముగాదు. పైతృకద్రవ్యము పొందనివాఁడు తండ్రిఋణము పేక్షింపవచ్చును. (౨. ౨౭౫, ౨౭౬ కో)

తండ్రిఋణము పుత్రుఁడు తీర్ప వలసినది।

౧౮౩. ఇంగిలీషు దొరతనమువారేర్పఱిచిన కోర్టుల వారుపైఁజెప్పిన నియమమునకు బద్ధులము కామనియెఱిఁగి యట్లుజరిగించుట ధర్మ్యము కాదనియెంచి పైతృకద్రవ్యము కొలఁదిమాత్రమే ఋణము పుత్రుఁడచ్చుకొనవలసినదనివిధించిరి. (స. కో. ౧౮౫౧ స్పె. అ. ౧౨ నం. లోతీర్పు)

౧౮౪. ఉత్తమర్ణుఁడధమర్ణునిద్రవ్యమెవ్వనివశ[illegible]ందుండినను దానిమీఁదఁ దగవాడవచ్చును (౨. ౨౮౨ కో)

ఆ స్తిమీఁదఁ దగవు తెచ్చుట।

౧౮౫. వితంతువు భర్తయొక్కద్రవ్యము పొందనిది వాని ఋణము తీర్పవలసినదిగాదు. (౨. ౨౮౦, ౨౮౧ కో. ఎ) ఈ విధి వానివెనుక జీవించియున్నబంధువుల కందఱికిసమానము.

వితంతువును త్తరవాదము।

కుటుంబని ర్వాహకుని యొక్క—

౧౮౬. సముదాయద్రవ్యము వశపఱుచుకొని కుటుంబ నిర్వాహకుఁడయిన కుటుంబి కుటుంబముమీఁదవచ్చు తగవులకన్నిటికి నుత్తరవాదియై యుండవలసినది. (౨. ౩౩౪ ఎ)

కుటుంబద్రవ్యము యొక్క—

౧౮౭. కుటుంబములోనియొక్కఁడు తనకయి చేసినఋణమునకుసముదాయద్రవ్యమీఁదుగాదు. (స. అ. వం.౧౮౫౪ నవంబర్ ౧౩)

౧౮౮. అయినను వానిఋణమునకు వానిభాగము మాత్రమీఁదవుచున్నది. (స. కో. ౧౮౫౫ స్వి. అ. నం. ౧౧౩ ౧౧౪లో తీర్పులు) అధమర్ణుని భాగమింతయని యేర్పడునట్లు ఉత్తమర్ణుఁడు ముందుదగవు తేవచ్చును. ఆభాగమందు నధమర్ణుని పుత్రులభాగములు మొదటఁద్రోపుడువెట్టి మిగిలినది యుత్తమర్ణుఁడు పొందవచ్చును. (మితాక్షరయందు దత్తాప్రదానికము)

వితంతువును త్తరాధి కారులయొక్క—

౧౮౯. విభక్తురాలయిన వితంతువుచేసిన ఋణమామె ద్రవ్యములోఁ జెల్లింపఁ దగినదయిన పక్షమందాఋణమునకామెయుత్తరాధికారు లుత్తరవాదులగుదురు.దాని తక్కిన ఋణమునకుఁగారు. (బం. స. ది. అ. ౭. ౧౧౪; బం. స. ది. అ. ౧౮[illegible] అ. నం. ౧౭౯లో తీర్పు)

ఉపనయనాదులకు వ్యయనియమము।

౧౯౦. సోదరుల యుపనయన విద్యారంభములకు సముదాయద్రవ్యమందు వ్యయము చేయవలసినది.

వివాహములకు—

౧౯౧. భగినీ సోదరులకు వివాహమాచోప్తున నే చేయవలసినది. (మితాక్షర ౧. ౭. ౪. ౫)

౧౯౨. స్వార్జితద్రవ్యమమాత్రముకలవాఁడు తనసోదరుల యుపనయన విద్యాభ్యాసములు నడపవలసినది. వివాహముచేయఁబనిలేదు. చెల్లెండ్రకువివాహముజరుపవలసినది. (స్మృతిచంద్రిక)

౧౯౩. పుత్రపౌత్రప్రపౌత్రుల యుపనయన విద్యాభ్యాస వివాహములకును బుత్రికల వివాహమునకును బితృభాగ ద్రవ్యమందె వ్యయాంశ మేర్పడియుండవలెను.

విభక్తకుటుంబములలో—

౧౯౪. తండ్రితోవిభక్తులయిన కొడుకులు తమతమసంతతివారికిఁదగిన వ్యయాంశములను దమతమ భాగములనుండియే జరిగింపవలసినది. పెండ్లికాని కూఁతుండ్రున్నపక్షమందుఁబ్రతివివాహమునకుఁ గొడుకులభాగములలో నాలవపాలువంతున నెత్తితండ్రిచేతి కిప్పింపవలసినది. (మితాక్షర ౧. ౭. ౬)

జీవనమునకు—

౧౯౫. కుటుంబభరణ మనునది బహుజన విషయకమై యుండును. కుటుంబమందు జ్యేష్ఠుఁడగువాఁడు సమస్తకుటుంబమును భరింపవలెను. (౧. ౬౭)

౧౯౬. పోషింపవలసినది తనభార్యాపుత్రులను మాత్రముగాదు. తండ్రిని దల్లులను దండ్రియొక్క తల్లిదండ్రులను వివాహములేని చెల్లెండ్రను వితంతువులయి గత్యంతరములేని చెల్లెండ్రను దనచేరుగొండ్లను వారిబిడ్డలను దోషముచేత దాయార్హతమాలినవారిని వారిభార్యాపుత్రికలను భరింపవలసినది. (౧. ౬౭, ౧౪౧, ౧౪౫)

౧౯౭. స్వీకారమునకు వెనుక దానికనర్హుండని తెలియఁ

బడిన (౧.౮౨) దత్తకుఁడు వరవుఁడుగా నెన్నఁబడి (౧౧౨) పోష్యుఁడవుచున్నాఁడు.

౧౯౮. న్యాయ్యమయిన నిమిత్తము లేకవిడువఁబడినభార్యను భరింపవలసినది. (౧. ౪౬) అయినను స్వల్పనిమిత్తము చేతఁదన్నువిడిచిపోయినభార్యను భరింపవలసినదిలేదు. (స. అ. ౧౮౨౩ అ. నం. ౨లో తీర్పు)

౧౯౯. బాల్యదశయందుండి తల్లిదండ్రులతో వసించుచున్నభార్యను సహితము భర్తభరింప వలసినది. (స. కో. ౧౮౫౮ స్పె. అ. నం. ౬౪ లోతీర్పు)

౨౦౦. పుత్రుఁడు గతించిన వెనుక వానిభార్యాపుత్రికలను భరింపవలసినది. (స. అ. పం. ౧౮౫౪ ఏప్రల్ ౧౦)

౨౦౧. భ్రాతయొక్క ద్రవ్యము పొందినవాఁడు భ్రాతృకుటుంబమును భరింపవలసినది. (స. అ. పం. ౧౮౫౪ నవంబర్ ౧౩)

౨౦౨. వేశ్యాపుత్రిక సాథూద్దాయార్హ్హరాలైనను వితంతువైనభ్రాతృ భార్యను భరింపవలయుట నిర్బంధము కాదు. (స. కో. ౧౮౫౮ స్పె. అ. నం. ౮౮లో తీర్పు)

౨౦౩. వైధవ్యమును జెందినకోడలు మామనుభరింపవలెను. (స. అ. పం. ౧౮౫౩ డిసెంబర్ ౧)

౨౦౪. అవిభక్తభ్రాతృ పుత్రులు పుత్రుఁడులేక గతించిన పితృవ్యునిభార్యను భరింపవలసినది. (స. అ. పం. ౧౮౪౫ ఆగస్టు ౩౦)

౨౦౫. వ్యభిచారముచేత వితంతువునకుఁదనజీవనాంశ మందు స్వత్వము నివర్తించును. (౧. ౧౭౨)

౨౦౬. అయినను దానికిజీవనాంశమియ్యవలసినది. ఆరీతినే వ్యభిచారిణియైన భార్యకు సయితమియ్యవలసినది. (౧. ౫౮; ౨౩౯) అది పేదపోఁడిమికిఁ దగుపాటిచాలును. తమ దుశ్చరితము మానుకొన్నపక్షమందే వారికాజీవనాంశ మియ్యవలసినది. (స. అ. పం. ౧౮౩౦ ఆగస్టు ౧౯; ౧౮౫౪ జనవరి ౨౬)

౨౦౭. వితంతువునకు స్వద్రవ్యముండినను లేకుండినను జీవనాంశ మియ్యవలసినది. భర్తకుజీవితకాలమందు భార్యయీలాగుననే పోష్యురాలనునిమిత్తమునఁజేసి యట్లుచెప్పఁబడినది. (స. అ. పం. ౧౮౫౩ పిబ్రవరి ౨౮) అట్టిసాహాయ్యముకోరవలసిన యక్కఱలేని పసిమిగలవితంతువు తనజీవనాంశముఁగోరుట పరులకు నిర్బంధరూపమైదుర్భరమయిన పక్షమందుదానినిధర్మసూక్ష్మమువిచారించివారింపవచ్చును.

౨౦౮. గతించిన వానియాస్తిని బొందెడువాఁడువాని పోష్యులను భరింపవలెను. (౧. ౧౩౭)

౨౦౯. స్వార్జితద్రవ్యముదప్ప నితరములేనివాఁడువృద్ధులయినతల్లిదండ్రులను భార్యనుబాలకులయినపుత్రులను దప్పక భరింపవలసినది. (మితాక్షరయందు దత్తాప్రదానికము)

౨౧౦. పిత్రార్జితద్రవ్యము లేనియెడల వితంతువయిన భ్రాతృభార్యను భరింపవలసిన నియమములేదు. (స. కో. ౧౮౫౯ స్పె. అ. నం. ౧౪౨లో తీర్పు)

భరణమిచ్చు వారితో వాసము నిర్బంధ నీయము గాదు।

౨౧౧. జీవనాంశము పుచ్చుకొను వారలిచ్చువారితో వసింపవలెనని నిర్బంధము లేదు.

౨౧౨. దీనికుదాహరణము. విధంతువు తనమామతోఁ గాని పెనిమిటి సోదరులతోఁగాని వసింపనక్కఱలేదు, (స. అ. పం. ౧౮౩౯ ఫిబ్రవరి ౧౬; ౧౮౫౫ ఫిబ్రవరి ౨౬)కొడుకుతోఁగాని సవతికొడుకుతోఁగాని సాధారణముగాఁ దనభర్తయొక్క బంధువులతోఁగాని వసింపనక్కఱలేదు. (స. అ. ౧౮౧౭ రి. అ. నం. ౧౩ లో, ౧౮౪౬ స్పె. అ. నం. ౧౭ లో తీర్పులు; స. అ. ప్రొ. ౧౮౫౧ సెప్టెంబర్ ౧౮)

౨౧౩. అవిధేయత పుత్రులదాయార్హత పోఁగొట్టనేరదు. కాఁబట్టి వారు భార్యకుఁబుట్టినవారుగాని చేరుగొండికిఁ బుట్టినవారుగాని తండ్రితోవసింప నక్కఱలేదు. (స. అ. ౧౮౨౧ స్పె. అ. నం. ౨లో తీర్పు)

పేదకుటుంబములోని ప్రత్యేకజీవనాంశము।

౨౧౪. వేఱువేఱుగా జీవనాంశమిచ్చుటకు ద్రవ్యము చాలకయుండెనేని యాప్రకారము భరింపవలయునక్కఱకుటుంబమువారిదికాదు. (స. కో. ౧౮౫౯ స్పె. అ. నం. ౧౬ లో తీర్పు)

భరణమనంగా నేమి।

౨౧౫. అన్నవస్త్రములకు వాసస్థానములకుఁ గావలసినది భరణమనఁబడు. అదియిచ్చువారియొక్క పుచ్చుకొను వారియొక్క దశకనురూపమయియుండవలసినది.

కాలావధి।

౨౧౬. జీవనాంశమునకై తేవలసినతగవు ద్రవ్యాధికారి చనిపోయినదినము మొదలుకొనిగాని జీవనాంశమునకిచ్చు

చుండి నిలిపినదినము మొదలుగాని పండ్రెండు సంవత్సరము
లకులోపలఁ దేనియెడలఁ జెల్లదని దొరతనమువారు విధించిరి.
(౧౮౫౯ శాసనము ౧౪ ప్రకరణము ౧౩)

౨౧౭. అట్టితగవునందు భరణ శేషము రావలయునని వాదింపఁగూడదు. (స. కో. ౧౮౫౮ రి. అ. నం. ౨౯ లో తీర్పు) భరణశేషము।

## ౯. ప్రకరణము.

### దాయానర్హత.

దాయానర్హ లలక్షణము।

౨౧౮. జడుఁడు వెఱ్ఱివాఁడు పుట్టుచెవిటివాఁడు పుట్టుగుడ్డివాఁడు మూఁగవాఁడు పిచ్చుకుంటువాఁడు చేతులు లేనివాఁడు దీర్ఘరోగి క్షయరోగి కుష్ఠరోగి నపుంసకుఁడును దాయమునకర్హులుగారు, (౧. ౧౫౨—౧౫౮; మితాక్షర ౨. ౧౦. ౩)

౨౧౯. రోగము పురాకృతపాపమున కడియాలమయి ఫలమయి యుండుననుభావముచేత దాయానర్హతకు వ్యాధి యొకనిమిత్తమని చెప్పుదురు. (౧. ౧౫౫, ౧౫౮ వ్యాధినివృత్తితో దాయానర్హత నివర్తించును.

౨౨౦. దౌర్జన్యము వికర్మత్వము వృథావ్యయమును దాయానర్హతకునిమిత్తములు. వృథావ్యయము చేసినవానికంతపాటిదే తనభాగమందు నష్టమవును. అయిననీవిషయములు చెల్లుట సందిగ్ధము. (౧. ౧౫౭—౧౬౦)

నేరపుదండుగ।

౨౨౧. నేరముచేసినవాఁడు తఱుచుగా దాయానర్హుఁడుగాఁడు. ఇంగిలీషు దొరతనమువారు హిందూదండనవ్యవహారనిబంధనలుమార్చి నేరముచేసినవానిని శిక్షించుటకుఁదగినదండన నియోగించుచట్టము నేర్పఱిచియున్నారు. కాఁబట్టి నేరముచేసినవానికి హిందూశాస్త్రముచొప్పునదాయానర్హత పుట్టించుటయధికదండనముగనుకనీహిందూశాస్త్రం

శము ప్రకృతమందుఁ జెల్లదు. (స. కో. ౧౮౫౮ స్పె. అ. నం. ౪౦లో తీర్పు)

౨౨౨. సముదాయద్రవ్యమందుఁ గొంత దొంగలించిన వాఁడు దాయార్హుఁడు కాఁడు. (స. కో. ౧౮౫౮ స్పె. అ. నం. ౪౦లో తీర్పు)

౨౨౩. దాయము పొందిన వెనుక మూఁగ, గుడ్డి, కుంటి, కుష్ఠరోగి యయినపక్షమందు దాయార్హుఁడు కాఁడు. (మితాక్షర ౨. ౧౦. ౬) వెఱ్ఱివాఁడు వ్యవహారమునకు యోగ్యుఁడు కాఁడు కాఁబట్టి వెఱ్ఱితనమెప్పుడు గలిగినను దాయాధికారము తత్క్షణము నివర్తించును. వాని ద్రవ్యము వాని యుత్తరాధికారుల యధీనమవును.

దాయానర్హతకు నిమిత్తములు।

౨౨౪. పైఁ జెప్పిన వ్యాధులు నివర్తించె నేని దాయమందు స్వాతంత్ర్యము మరలఁ గలుగును. (మితాక్షర ౨. ౧౦. ౭)

దాయానర్హత।

౨౨౫. దాయానర్హతకు నిమిత్తములయిన దోషములు పురుషులకువలెనే స్త్రీలకును బాటింపఁబడును. (౧. ౧౬౪) వంధ్యాత్వము దాయానర్హతకుఁ గారణము కాదు.

దాయానర్హత స్త్రీ పురుష సామాన్యము।

౨౨౬. దాయానర్హుల సంతతివారికి దోషములు లేనిపక్షమందు దాయార్హత పోనేరదు. (౧. ౧౬౩)

అంశానర్హుల సంతతివారు

౨౨౭. సన్యాసికి దాయార్హత లేదు. (౧. ౧౬౪)

౨౨౮. శూద్రులందుఁ దప్పఁ జేరుగొండిదాని కొడుకులకు దాయార్హత లేదు. (౧. ౧౬౫)

చేరుగొండి దాని కొడుకులు।

౨౨౯. జాతిభ్రంశము దాయానర్హతకు నిమిత్తము. ఈ

జాతిభ్రష్టులు।

విధియింగిలీషుదొరతనమువారిచేత వారింపఁబడ్డది. (౧౮౫౦ ౨౧ ఆక్టు)

జారిణులు। ౭౩౦. అట్లుజారిణి విషయమందు వారింపబడదు. ఇంగిలీషు శాస్త్రముచొప్పున వివాహబంధము త్రికయి తెచ్చిన వ్యవహారమునకులోపడి తనభర్తకు వెనుక రాఁగలస్వత్వము జారిణి పోఁగొట్టుకొనును. హిందూశాస్త్రముచొప్పునవివాదముజోలిలేక తోడనేవివాహబంధము పోఁగొట్టుకొనును. కాఁబట్టి వ్యవహారపర్యంత మవకాశములేకయే జారిణికిద్రవ్యమందు స్వత్వము నివర్తించును.

## ౧౦. ప్ర క ర ణ ము.

### దాయభాగము.

౨౩౧. హిందువులయందు ద్రవ్యముసమస్వత్వముగల దాయాదులకు మెట్టువరుసను సముదాయముగాఁ జేరును. కొందఱు దాయాదులయొక్క స్వత్వము కొన్నితరములవఱకు వారిసంతతివారిని జేరునట్లుజీవించియుండు.

సమానులైన యుత్తరాధికారుల సముదాయ స్వత్వము।

౨౩౨. పితామహాదుల ద్రవ్యమందుఁ దండ్రితోఁడఁగొడుకులుసమానస్వత్వముగలవారు. పుత్రులులేనిపక్షమందుఁ బౌత్రప్రపౌత్రులు సమస్వత్వముగలవారు.

పితాపుత్రులు।

౨౩౩. చిరప్రవాసియయిన వాఁడుగాని వానిసంతతిగాని యున్నచోటిదియని తెలియనిపక్షమందు వానిదాయస్వత్వము వానిపుత్రపరంపరయందాఱవతరమువఱకు జీవించియుండును. (౧. ౧౮౭, ౧౮౮)

కానఁబడనివారి యొక్క స్వత్వము।

౨౩౪. పితాపుత్ర పౌత్రప్రపౌత్రులు సరిమెట్టువారు; అట్లుభ్రాతృ తత్పుత్రపౌత్రప్రపౌత్రులు; ఆరీతిని బితృవ్యపుత్రపరంపరవారు; ఆచొప్పున వారివితంతువులు; ఆవిధమునఁ బుత్రికలు; ఆప్రకారమునఁ బుత్రికాపుత్రులు; అట్లుదాయార్హులయినపుత్రికాపుత్రికలును దమలోఁదాము సహజముగాఁ బాలివారు.

సరిమెట్టున ముదాయ భాగులు।

౨౩౫. వీరిలోఁ బుత్రులు సోదరులు (మితాక్షర ౧. ౨. ౫) వితంతువులు (స్మృతిచంద్రిక) తండ్రివలనద్రవ్యముపొం

అంశభాగులు। అంశాంశభాగులు।

దుపుత్రికలును (మితాక్షర ౨.౨.౧) సమాంశభాగులు. మఱియుఁ గొడుకులకొడుకులు, కొడుకులమనుమలు, సోదరుల కొడుకులు, వారికొడుకులకొడుకులు, కొడుకుమనుమలు, పితృవ్యపుత్రులు (మితాక్షర ౧.౪.౧) పుత్రికయొక్కపుత్రులు. మాతృద్రవ్యముపొందు పుత్రికలు, (మితాక్షర ౨.౧౧.౧౬) పుత్రికలమనుమరాండ్రు నంశాంశభాగులు.

పుత్రికలు।

౨౩౬. పుత్రికలయందు వివాహితకంటె ముందువివాహము లేనిదానికిని బుత్రహీనురాలికంటె ముందుపుత్రవతికిని స్త్రీధనముగలదానికంటె ముందుస్త్రీధనము లేనిదానికిని దాయము చేరును. (౧.౧౩౭ ; మితాక్షర ౨.౧౧.౧౩)

సమాంశకుల పరంపరా స్వత్వము।

౨౩౭. పుత్రపౌత్రప్రపౌత్రులు లేనివానియొక్కభాగము వానిసోదరులను జెందును. ఈతీరుననే పుత్రికపుత్రరహితురాలయిన పక్షమందు దానియంశ మితరపుత్రికలకుఁ జేరును. తక్కిన సమాంశకులయొక్క వర్గములయందొక్క సమాంశకుని స్వత్వము వానిసంతతివారిని జెందకమునుపు జీవించియున్న తనసరిమెట్టువారిని జెందును.

స్వార్జితము।

౨౩౮. ఒక్కసమాంశకునియొక్క స్వార్జితము తక్కిన సమాంశకులకుఁ జేరదు. వానిసంతతివారికిఁ జేరును. (౧.౧౨౦)

౨౩౯. సోదరులు తమయార్జితములకయి యొండొరులతో నిర్ణయము చేసికోవచ్చును. (కోయంబుత్తూరు సీవిల్ కోర్టు ౧౮౫౨ అ. నం. ౧౨౯లో తీర్పు)

౨౪౦. తనతోఁగూడి కాపురముచేయుచున్న కొడుకుల

యార్జితమందుఁ దండ్రికి సమభాగముగలదు. అయిననది తండ్రిజోలిగాని ద్రవ్యసాహాయ్యముగాని లేక యార్జించిన ద్రవ్యమందు లేదు. (౧, ౬౩, ౬౪)

౨౪౧. కొంత ద్రవ్య మార్జించినపిమ్మట సోదరునిఁగూర్చి కొని యాద్రవ్యమును వృద్ధిపొందించినపక్షమందు సర్వద్రవ్యములోసగముపాలు సోదరునికివచ్చును. (స. కో. ౧౮౫౮ రి. అ. నం. ౧౮౭లో తీర్పు)

౨౪౨. తండ్రికనంతరము కూడివసించుకుటుంబమువారియందు జ్యేష్ఠుఁడయినవాఁడు తక్కినవారిచేత యోగ్యుఁడుగాఁడని నిర్వాహకుఁడుగాఁడని మాటచెప్పుకొనివాఁడయినపక్షమందు సముదాయద్రవ్యముంచుకొని కుటుంబకార్యములు నడపవచ్చును. (౧. ౧౯౯)

సముదాయ ద్రవ్య మందు నిర్వాహకుఁడు।

౨౪౩. అట్టి జ్యేష్ఠుఁడు కుటుంబము మేలుకయి చేయు కార్యములు చెల్లునుగాని ద్రవ్యవినియోగమందు మాత్రము సమాంశకులయొక్క యనుమతిని వచనముచేతఁగాని లేఖ్యముచేతఁగాని హేత్వంతరముచేతఁగానిపొందవలసినది. (౧. ౧౯౯, ౨౦౦)

నిర్వాహకుని యధికారము।

౨౪౪. సముదాయద్రవ్యముదాయాదులుతమతమపాళ్లమేరకు విభాగించుకోవచ్చును. దానితోనే యవిభక్తత్వమునివర్తించును. విభక్తద్రవ్యమాయాపాలివాని కేచేరిపిమ్మట వానిసంతతివారికిఁజేరుట విభాగమునకు ఫలము.

విభాగానుమతి।

౨౪౫. పుత్రులు పితామహద్రవ్యమును దమతో భాగిం

పుత్రులుదా

యము భాగిం పుమని తండ్రి నడుగు నధికారము.

చుకొమ్మని తండ్రియొక్కదశ పాటింపకయే తమయిచ్చను వానిని బలాత్కరింపవచ్చును. (మితాక్షర ౧. ౫. ౮)

౨౪౬. పుత్రులుగతించిన యనంతరము వారికిమారు పౌత్రప్రపౌత్రులు భాగముకయి యట్లు బలాత్కరింపవచ్చును. (మితాక్షర ౧. ౧. ౩, ౨౩)

౨౪౭. తండ్రిసన్న్యాసియయినవాఁడు మృతప్రాయుఁడుగావునవాఁడు లేకయేపుత్రులుభాగించుకొనవచ్చును. (౧. ౧౭౯)

౨౪౮. జాతిభ్రష్టుఁడు మృతప్రాయుఁడని శాస్త్రము చెప్పుచున్నదిగాని యింగిలీషుదొరతనమువారు జాతిభ్రంశము ద్రవ్యస్వత్వమందుఁ బ్రతిబంధకముకాదనిచట్టమేర్పఱిచిరి. (౧౮౫౦ ఆక్టు ౨౧)

పితాపుత్రులు సరిగా భాగించుకొనుట.

౨౪౯. తండ్రిగొడుకులు పైతృకద్రవ్యమును సమముగా భాగించుకొనవలసినది. (మితాక్షర ౧. ౫. ౫) తండ్రి స్వార్జితముమాత్రముతనకేయుంచుకొనవచ్చును. (౧. ౧౯౬)

౨౫౦. పుత్రులకందఱికి భాగములు తుల్యములు. తల్లులసంఖ్యఁబట్టి హెచ్చుతక్కువలు కానేరవు, (౧. ౧౯౩, ౨౦౫)

౨౫౧. శూద్రజాతియందుఁ బుత్రులకు మాతృసంఖ్యఁబట్టి విభాగమనియెంతురుగాని యాయభిప్రాయము సరిగాదు. పుత్రులకందఱికి సమభాగవిధి యెల్లవర్ణములవారికి సమానమైయుండును., (స. అ. ౧౮౪౬ రి. అ. నం. ౨౦లో తీర్పు)

౨౫౨. దత్తస్వీకారము పిమ్మట జన్మించిన పుత్రులందొక్కనికి వచ్చిన భాగములో నాలవపాలి సరిపాలు దత్తునికి రావలసినది. (ఎల్ బ్లర్లిజ్ ౭౧) — *పుత్రస్వీకారానంతరము పుట్టిన పుత్రులు।*

౨౫౩. శూద్రులలోఁ గులస్త్రీపుత్రునకుఁగాని పుత్రికకుఁగాని దౌహిత్రునికిఁగాని వచ్చు భాగములో సగముకొఁలది పాలు దాసేరులకు రావలసినది. (మితాక్షర ౧. ౧౨. ౨) — *శూద్రులదాసేరులు।*

౨౫౪. శూద్రులయందుఁ బుత్రుఁడు, పుత్రిక, దౌహిత్రుఁడును లేనిపక్షమందుఁ జేరుగొండి కొడుకులు సమభాగము పొందుదురు. తండ్రి జీవించియున్నప్పుడు వానిసమ్మతి లేక భాగము రాదు. (మితాక్షర ౧. ౧౨. ౨)

౨౫౫. పేదఱికము వచ్చినప్పుడు ముందు పుత్రులకుఁ బంచియిచ్చిన స్వార్జితద్రవ్యమును మరలఁ బుచ్చుకోవచ్చును. (౧. ౧౯౬) — *స్వార్జితద్రవ్యము మరలఁ బుచ్చుకొనుట।*

౨౫౬. అవిభక్తులయిన యితరులుండఁగా భాగ మొకపుత్రునికిమాత్రమియ్యవచ్చును. (౧. ౧౯౩, ౧౯౪) తమతమ భాగమిమ్మని పుత్రులం దొక్కఁడొక్కఁడు తండ్రి నడుగవచ్చును. అందఱుగూడి వానిమీఁద వ్యవహారము తేవచ్చును. — *ఒకపుత్రుఁడు భాగించుకోవచ్చును।*

౨౫౭. విభాగము ప్రసక్తించినపుడు పుత్రుఁడుగాని యితరసమాంశకుఁడుగాని తక్కినవారి తృప్తికయి యేదో కొంచెము పుచ్చుకొని భాగము మానుకొనవచ్చును. వాఁడు చేసినదానికి వాని యుత్తరాధికారులు కట్టుపడ వలసినది. (౧. ౧౯౫, ౨౦౭) తనజీవనమునకు సంపాదించుకొను శక్తి లేని వాఁడట్లు మానఁగూడదు. మితాక్షర ౧. ౨. ౧౧, ౧౨) — *భాగము మానుకొనుట।*

విభాగానంతరము పుట్టిన పుత్రులు।

౨౫౮. తండ్రికొడుకులతో విభాగించుకొన్న వెనుకఁగన్నకొడుకులకు వానిభాగమందే పాలువచ్చును. మితాక్షర ౧. ౬. ౨)

౨౫౯. విభాగానంతరము పుట్టినపుత్రునకుఁ దండ్రిపాలిలో భాగమువచ్చునుగాని ముందువిభక్తులైనతోఁబుట్టువులపాలిలో రానేరదు. వీరియందెవ్వరైనఁ దండ్రితోమరలఁ గూడియుండిరేని వారువానితోసమముగా భాగించుకొనవలసినది. (౧. ౧౮-౨)

విభక్తపుత్రులు।

౨౬౦. తదనంతరము పుత్రులుపుట్టనితండ్రియొక్క భాగమును విభక్తులైనపుత్రులు పొందుదురు. (౧. ౧౮-౩)

పిత్రార్జితము।

౨౬౧. తండ్రిపోయిన వెనుక వానిస్వార్జితము భాగించుకోవలసి ప్రసక్తించినప్పుడు పుత్రులు పితామహద్రవ్యమువలెనే సమానముగా భాగించుకోవలసినది. (౧. ౨౦౮)

తల్లిగాని తండ్రిగాని పోయినవెనుక విభాగము।

౨౬౨. తల్లిదండ్రుల మరణానంతరము వారిద్రవ్యము పుత్రులుపంచుకొనవలసినదని మనుస్మృతియందు (౯. ౧౦౪) చెప్పఁబడినది. దీనిచేతఁదల్లిదండ్రులిద్దఱును గతించినపిమ్మట నేపుత్రులు భాగించుకొనవలెనని తాత్పర్యముగాదు. పుత్రులుండఁగాఁదల్లిదండ్రులలో నొకరిద్రవ్యమందొకరి కధికారము లేదుగాఁబట్టి వారిలోమరణించినవారిద్రవ్యము భాగించుకొనవచ్చుననుట తాత్పర్యమని స్మృతిచంద్రికయందు వివరింపబడినది. (౧. ౨౦౪) తల్లిద్రవ్యమందు స్వత్వము పుత్రికలదిగాఁబట్టి వారులేనిపక్షమందే యాద్రవ్యము పుత్రులు పంచుకొనవచ్చును. (మితాక్షర ౧. ౩. ౧౩)

౫౬౩. ఒకయంశకుఁడవిభక్తులై కూడియున్న తక్కిన వారిని దనభాగము పంచియిమ్మని కక్షిసింపవచ్చును. (౧. ౨౦౪)

ఒకయంశకుఁడు తనభాగముపంచియిమ్మని యడుగవచ్చును।

౫౬౪. బాలుఁడు తనయంశమునకు దుర్వ్యయము చేత హానిరానిపక్షమందు దానికైతగవాడఁగూడదు. హానివచ్చు పక్షమందు వానిసంరక్షకుఁడు దానికైతగవు తేవచ్చును. (౧. ౨౦౬)

బాలునికై భాగమడుగవచ్చును।

౫౬౫. అపుత్రకుఁడై గతించిన సోదరునిభార్య గర్భిణియైయుండఁగాఁ బ్రసక్తించిన విభాగమందొకభాగముపుట్టఁగలపుత్రునికనియెత్తియుంచవలసినది. (౧. ౨౦౭; మితాక్ష ర. ౧. ౬, ౧౧)

వెనుకఁబుట్టినపుత్రుఁడు।

౫౬౬. సోదరులు భాగించుకొనుటయందు సంభవించు న్యూనాధిక తలకుదాహరణములుమీఁద వ్రాయఁబడును—

భాగవైషమ్యము।

౧ది—అ బ స అనువారు సోదరులు. అ అనువాఁడు డ ఇ ఫ అనుముగ్గురు పుత్రులనుగని గతించినాఁడు. వీరియందొకఁడు డ అనువాఁడు గ హ ఐ అనుముగ్గురు కొడుకులనుగని గతించినాఁడు. బ స అను మొదటిసోదరులు జ క అనువారిని జెటియొకనిఁ బుత్రస్వీకారము జేసి గతించినారు. ఇట్లుండఁగాదాయ భాగము ప్రసక్తించినది. అప్పుడు ద్రవ్యముమూఁడుపాళ్లుచేసి జ క అనువారికిఁ జెటియొక్కొక్కపాలియ్యవలసినది. మిగిలినయొకభాగమును మూఁడుపాళ్లుచేసి ఇ ఫ అనువారికిఁ జెటియొక పాలియ్యవలసినది. అందునిలిచిన

భాగమును మూఁడుపాళ్లుచేసి గ హ ఐ అనువారికిఁ జెటి యొక్కొక్క పాలియ్యవలసినది. ఫలితార్థము. జ క అను వారికిఁ జెటిమూఁడవయంశముసముదాయద్రవ్యమందియ్య వలసినది. ఇ ఫ అనువారికిఁ జెటితొమ్మిదవ భాగమియ్యవల సినది. గ హ ఐ అనువారికిఁ జెటియిరువదియేడవపాలియ్య వలసినది. (వి. ౩౧౨, ౩౧౩)

౨౭౬—అ బ స అనువారు సోదరులు. అ అనువాఁడు డ అనుపుత్త్రునిగని కతించినాఁడు. డ తనతండ్రికి రావలసినదా య తృతీయాంశ మడిగి పుచ్చుకొన్నాఁడు. ఆవెనుక బ సం తులేనివాఁడై గతించినాఁడు, వానిభాగముజీవితుఁడై యవి భక్తుఁడైన స అనువానికిఁ జేరినది. విభక్తుఁడైన డ అనుజ్ఞా తికి దానిమీఁదఁ దగవు లేకపోయినది. (గంజాము జి. కో. పం. ౧౮౦౬ ఫిబ్రవరి ౮) డ అనువాఁడు బ అనువానీ మరణ మునకు ముందువిభక్తుఁడు కాకుండి వెనుక క అనువానితో వి భాగించుకొన్నపక్షమందుఁ దనతండ్రిభాగముతో గతించిన వాని సగముపాలు చెందియుండును.

పుత్త్రికలు।

౨౬౭. సమాంశకలయిన పుత్త్రికలు తమకువచ్చినద్రవ్య ముపుత్త్రులవలెనే భాగించుకోవచ్చును. (ద. ఖం. ప్రా. కో. పం. ౧౮౧౭ సెప్టంబర్ ౧౦)

విభక్తద్రవ్య ముస్వవంశ ప రంపర నుం డి తప్పిపోవు ట।

౨౬౮. సోదరులకువచ్చిన విభక్తద్రవ్యము తమవంశ ప రంపరనుండి తప్పిపోనుగాని పుత్త్రికలకట్లుదప్పదు. (పెద్దమె క్నాటన్ ౫౫) దీనికుదాహరణము. అపుత్త్రకుఁడైనవిభక్త

సోదరునియొక్క ద్రవ్యము వానిపత్నికిఁగాని పుత్రికలకుఁ గాని చేరును. పుత్రికలయందు విభాగమిట్లుగాదు. వివాహితురాలైగతించిన సమాంశకురాలియొక్క ద్రవ్యము దానిపరంపరవారికిఁజేరును. అవివాహితురాలిద్రవ్యము దాని సోదరులు మొదలైనవారికిఁ జెందును. మితాక్షర ౨. ౧౧. ౧౨, ౩౦)

౨౮౯. పంచాయతివారివలనఁగాని పరస్పరసమాధానమువలనఁగాని చీట్లువేయుటవలనఁగాని విభాగముచేసికొనవచ్చును. (౧. ౧౯౦) ఇట్టియేకుదురుబాటుగాని యనుమాలింపనిపక్షమందు విభాగము వ్యవహారముచేతనే సిద్ధింపవలసినది.

విభాగ సిద్ధిక్రమము।

౨౯౦. ద్రవ్యముకలవాఁడు గతించినది మొదలుకొనిగాని భాగమునకైకొంతద్రవ్యముపుచ్చుకొన్నదినము మొదలుకొనిగాని పంద్రెండు సంవత్సరములవఱకు భాగముకొఱకు వివాదముతేవచ్చును. పిమ్మటఁగూడదు. (౧౮౫౯ శాసనము ౧౪ ప్రకరణము ౧౩) తండ్రి, కొడుకులు, పౌత్రులు, ప్రపౌత్రులు, సోదరులువారి పురుషసంతతివారును ద్రవ్యమందు సమానాధికారులుగనుక వారందఱును బురుషసంతతిలేక నశించిన పక్షమందుమాత్రము పైఁజెప్పిన శాసనమునందలి మొదటివాక్యము చెల్లుబడికివచ్చును.

కాలావధి।

౨౯౧. విభాగదశయందు ఋణవ్యయముల కాస్తిలోనే యేర్పాటుచేయవలసినది. (౧. ౧౯౧, ౧౯౨) ఈఋణవ్యయాంశములు సమాంశకులు భాగించుకో వచ్చును. (౨.

ఆస్తిలోనివ్యయములకేర్పాటు।

౨౯౩. కో) లేదా వలసినపక్షమందు జీవనమునకు భాగమే ర్పఱిచినట్లు ఋణవ్యయములకు భాగమొత్తియుంచవలసినది. ఉత్తమర్ణులిట్టిభాగపరిష్కారముతోజోలిలేకసర్వద్రవ్యమందుఁదగవు తేవచ్చును.

సమాంశకుని వలన వచ్చిన నష్టమునకుఁ బరిహారము।

౨౭౨. ఆస్తియందుదుర్వ్యయముఁగాని చెల్లనివినియోగముఁగానిచేసిన సమాంశకుఁడా నష్టాంశముతగ్గించి భాగముఁబుచ్చుకోవలసినవాఁడు, ఈనష్టము వానిభాగమునకు మీఱియున్నపక్షమందు దానిమిగతకై వానిమీఁద వ్యవహారము తేఁగూడదు. (౧. ౨౨౪, ౨౨౫) అయినను వానిస్వార్జితద్రవ్యముమీఁదఁ దగవు తేవచ్చును.

సమాంశకుఁడుదాఁచినద్రవ్యమునకు—

౨౭౩. ఒకసమాంశకుఁడు తక్కినవారిని మోసపుచ్చవలెనని యాస్తియందేమాత్రముగాని దాఁచినద్రవ్యము కొలఁదిఁ దనభాగమందు నష్టమొప్పుకోవలసినది. (మితాక్షర ౧. ౯. ౪—౧౨)

వెలిపడినద్రవ్యము యొక్కవిభాగము

౨౭౪. ఒకసారిచేసినవిభాగము సాధారణముగాఁజెడనేరదుగాని విభాగమునకు రానివస్తువులు వెలిపడినపక్షమందవి సహితము వెనుక విభాగించుకోవచ్చును. (౧. ౨౩౦, ౨౩౧)

మరల విభాగము।

౨౭౫. విభాగకాలమందు నిమిత్తము తెలియక భాగములు హెచ్చుతక్కువలైనపక్షమందు మరల విభాగించుకోవచ్చును. (౧. ౨౩౨) ఈకార్యము సమాంశకులసమ్మతిమీఁద జరుగవలసినది. మోసముజరిగియున్నపక్షమందు ధర్మస్థానమువారదిపరిహరింతురు.

౨౭౬. సముదాయ ద్రవ్యమును వృద్ధిఁబొందించిన సమాంశకునకు భాగమధికము కలుగనేరదుగాని (౧. ౨౧౩) సముదాయద్రవ్య సాహాయ్యముచేత వేఱుగా సంపాదించిన ద్రవ్యమందుమాత్రము రెండంశములువానికి వచ్చును. (౧. ౨౧౦; స. అ. ౧౮౧౪ రి. అ. నం. ౭లో తీర్పు) ఈస్వత్వము వానిపుత్రసంతతికి సహితముకలదు.

సముదాయ ద్రవ్యవృద్ధి నవీనార్జితము.

౨౭౭. నష్టమైనకుటుంబ భూస్థితిని కుటుంబద్రవ్యసాహాయ్యములేక యుద్ధరించి యదికుటుంబమున కుపయోగింపఁ జేసిన సమాంశకునకాద్రవ్యమందు విశేషముగా నాలవ భాగము చేరవలసినది. మిగిలినది యితర సమాంశకులును వాఁడును భాగించుకోవలసినది. (మితాక్షర ౧. ౪. ౩.)

కుటుంబన ష్టార్జిత ద్రవ్యము.

౨౭౮. ఆస్తియందుఁ గొంతయంశము భాగించుకొని శేషము తర్వాత భాగించుకొనుటకు నిలిపియుంచవచ్చును. (౧. ౧౯౫)

అంశవిభాగము.

౨౭౯. అంశభాగులు విభాగానంతరము సంసృష్టులై యుండవచ్చును. పిమ్మటఁ గ్రొత్తగానే విభాగము చేసికోవచ్చును. (౧. ౨౩౩) ఇట్టిసంసృష్టత పితాపుత్రులయందును సోదరులయందును పితృవ్యభ్రాతృ పుత్రులయందునుమాత్ర మనుజ్ఞాతమైయున్నది. (మితాక్షర ౨. ౧౧. ౩)

విభాగానంతరము సంసృష్టి.

౨౮౦. క్రిందఁ జెప్పఁబడు ద్రవ్యములు విభాజ్యములు గావు—

అవి భాజ్యమైన ద్రవ్యము.

(౧.) ధర్మార్థమువిడిచిన భూములును ధర్మార్థమేర్పఱిచిన సమస్తవస్తువులును. (౧. ౨౦౮, ౨౧౦)

(౨.) జ్యేష్ఠపుత్రునకు లభించినరాజ్యమును ప్రాచీనములైన జమీనులును. (౧. ౧౯౭, ౨౦౭; స. అ. ౧౭౮౬ రి. అ. నం. ౨౨లో తీర్పు)

(౩.) కుటుంబముయొక్క సమ్మానమునకై పరువుకై యిచ్చినభూమి. (స. అ, ౧౭౫౦ రి. అ. నం. ౫లో తీర్పు)

(౪.) దొరతనమువారి శాసనముచేతలభించి నవీనముగా జ్యేష్ఠపుత్రుని పేర జేసిన జమీనులు. (స. అ. ౧౭౧౬ రి. అ. నం. ౧౧లో తీర్పు)

(౫.) సముదాయ ద్రవ్యములోనిదయినను వధూసహితుఁడయి గ్రహించిన యౌతకద్రవ్యము. (౧. ౨౧౫, ౨౧౬)

(౬.) వాడుకగాధరింపఁబడు స్వీయములయినవస్త్రాభరణములు. (౧. ౨౧౧)

భాగయోగ్యములయిన కొన్ని విషయములు।

౨౭౧. జ్యేష్ఠపుత్రునకు లభించినరాజ్యములు ప్రాచీనములయిన జమీనులు విభాజ్యములుగావుగాని రాజుయొక్కగాని జమీన్దారునియొక్కగాని జంగమద్రవ్యము విభాజ్యము (౨. ౩౨౯, ౩౩౦ ఏ; స. అ. ౧౭౧౬ రి. అ. నం. ౧౧లో ౧౮౪౭ రి. అ. నం. ౬౪లో తీర్పులు)

౨౭౨. జాగీరులు, శ్రోత్రియములు, పౌరోహిత్యము, గుడియూడిగము మొదలైనవి, విభాజ్యములు. (౧. ౨౧౦)

౨౭౩. తండ్రియొక్కవస్త్రాశనము పుత్రులకు విభాజ్యము. (౧. ౨౦౯)

లిఖితపురస్స

౨౭౪. భాగహారులు తమతమలాభములు కాపాడుకొ

నుటకొఱకు వివాదము రాకుండుటకొఱకు నొకరిచేతనొకరు భాగపత్రికలు పుట్టించుకొనవలసినది.

రమైన విభాగముయుక్తము।

౨౮౫. ఈ భాగపత్రికలయందు వానివాని విభాగమునకు వచ్చినవి యీ యీ వస్తువులని యేర్పడియుండవలసినది. జ్ఞాతులుగాని తుదకన్యులుగాని సాక్షిచే వ్రాలుచేసియుండవలసినది. (౧. ౨౨౨, ౨౨౩)

౨౮౬. ఇట్టి సాధనముల పేక్షణీయములైనను మిక్కిలి యావశ్యకములుగావు. (౧. ౨౨౨)

౨౮౭. కుటుంబమందు విభాగముగలిగినదనుటకు గుఱుతు పాలివారికిఁ దమతమభాగములు చేరియుండవలెను. విభాగపత్రములుమాత్రము కలిగియుండుటదానికి గుఱుతుగాదు. (స. అ. ౧౮౬౮ రి. అ. నం. ౬, ౮ లో తీర్పులు)

భాగనిరూపణ।

౨౮౮. క్షేత్రవిభాగములేక సస్యముమాత్రము భాగించుకొనుటచేత విభక్తకుటుంబమని చెప్పఁగూడదు. (నెల్లూరు జి. కో. సం. ౧౮౭౨ అక్టోబర్ ౮)

౨౮౯. భాగముకయి తగవాడుచున్నవాఁడు వ్యవహారము జరుగుచుండఁగా గతించెనేని వాఁడవిభక్తుఁడని యెంచవలసినది. కాఁబట్టి వానిభార్యకు వానిభాగమడుగుట కధికారము లేదు. (స. అ. ౧౮౫౫ రి. అ. నం. ౮౬లో తీర్పు)

౨౯౦. కుటుంబద్రవ్యమందు భాగస్వత్వము కలవాఁడని తీర్పుఁబొందినవాఁడు తీర్పుచొప్పున విభాగించుకొనకముందు గతించెనేని వాఁడవిభక్తుఁడని యెంచవలసినది. (స. అ. ౧౮౫౫ స్పె. అ. నం. ౬౮లో తీర్పు)

౭౯౧. సముదాయద్రవ్యమందుఁ గొంతయంశము భాగించుకొని మిగిలినయంశము గొంతకాలమువఱకుఁ గార్యార్థముగా నిలిపియుంచుకొన్నపాలివారు విభక్తులని యెన్నఁబడుదురు. పాలివారిలో గతించినవానియొక్క భార్యయా మిగిలిన రాశియందుఁ దనభర్తకు రావలసినభాగమడుగవచ్చును. (స. అ. పం. ౧౮౫౫ ఏప్రల్ ౧౯)

అవిభక్తులని యూహించుట।

౭౯౨. హిందువులలోఁ గుటుంబమువారుగూడి వసించుట స్వాభావికముగావున విభాగము వివాదగ్రస్తమయిన పక్షమందుఁ గుటుంబమువారు విభక్తులయినారనుట రుజువగువఱకు విభాగముకలుగలేదనియే యెంచవలసినది. (౧ ౨౨౫)

విభాగనిశ్చయమున కనుమాపక లక్షణములు।

౭౯౩. విభక్తత్వమునకుఁ బ్రత్యక్షప్రమాణములేని పక్షమందదియనుమానప్రమాణముచేత నిశ్చయింపవలసినది. ఇట్లునిర్ణయించుటకష్టము.

౭౯౪. కుటుంబమువారు నివాసభోజన శుభాశుభకృత్యములయందు వేఱుపడియున్నను విభక్తులుకాక యుండవచ్చును. చెప్పిన నివాసాదులందు వేఱుపడకున్నను విభక్తులయి యుండవచ్చును. (౧. ౨౨౫, ౨౨౬)

౭౯౫. వైశ్వదేవాదికర్మములయందు భిన్నులయియుండుట; భిన్నపాకులయి యుండుట; ఒడంబడికలు ఋణక్రయవిక్రయము లొండొరులతో జరుపుట; యొకనికొకఁడు * పూఁటపడుట; ద్రవ్యవిషయమందొకని కొకఁడు ప్రతికూల

ముగాఁగాని యనుకూలముగాఁగాని సాక్ష్యముచెప్పుట; వి భక్తులనిపొరుగువారికిఁ దెలియఁబడియుండుట; గ్రామము యొక్కవచ్చుబళ్లు వేఱువేఱుగాఁ రాఁబట్టుకొనుటయు; వి భక్తత్వమునకనుమాపక లక్షణములు. (౧. ౨౨౭)

౨౯౬. కుటుంబసముదాయముతో సంబంధించిన కర్మ ము వేఱుగాఁజేసికొనుట విభక్తత్వమున కనుమాపక లక్షణ మగునుగాని వాఁడువాఁడు తనయిచ్చకువచ్చినట్లుచేసికొను పృథక్కర్మము లట్లుకానేరవు. అయినను సముదాయకర్మ మందు వేఱుపడకుండుటచేతనే యవిభక్తత్వలక్షణము మ గిసినదిగాదు. (౧. ౨౨౭, ౨౨౮) శ్రాద్ధవైశ్వదేవగృహ దే వతార్చనములుకుటుంబసముదాయముతో సంబంధించిన కృ త్యములు. త్రిసంధ్యమందుఁజేయఁదగినకర్మములుబ్రహ్మయ జ్ఞమునవగ్రహపూజ యౌపాసనము మొదలైనవిపృథక్క ర్మములు.

౨౯౭. విభక్తత్వమునకు దృఢమయిన రుజువుండఁగాన పరక్రియలు సముదాయము వారు కూడిచేసినమాత్రానవిభ క్తులుగారని చెప్పఁగూడదు. (౨. ౩౯౧, ౩౯౨ కో, ఎ)

౨౯౮. మునుపుచెప్పిన లక్షణములు సర్వముసాధకప్ర మాణములైయున్నవిగాని యవియన్నియునుండవలెనని య క్కఱలేదు. (౧. ౨౨౮)

౨౯౯. ఏకగృహమందు వసించుచు భాగహారులు భిన్న పాకులయియుండుట విభక్తతకు ముఖ్యమయిన యనుమాప

కలత్రుణమును విశ్వసింపఁదగినది. ఇదియు హేత్వంతరముల చేతఁ బరిహార్యము కావచ్చును. (౧. ౨౫౫, ౨౫౯ ; ౨. ౩౯౭ కో.)

౩౦౦. పాలివారందఱు సమ్మతించి తమలో నొకనికి స్వముదాయద్రవ్యము విక్రయింపవచ్చును. (స. కో. ౧౮౬౦ స్పె. అ. నం. ౮౮లో తీర్పు) అదివిభక్తతకు గుఱుతు కాదు.

## ౧౧. ప్రకరణము.

### దాయాధికారము.

దాయవిభాగమునకుపక్రమము।

౩౦౧. ఒకఁడు మృతుఁడుగాని సన్న్యాసిగాని యు నికి దెలియరాక గతించినాఁడనిసంభావింపఁదగినంతకాలము చిరప్రవాసిగాని యయినపక్షమందుఁ దక్కిన దాయాదులు దాయమువిభాగించుకోవచ్చును. (౧. ౧౨౨)

౩౦౨. జాతిభ్రష్టుఁడు సహితమట్టివాఁడే (౧. ౧౨౨) కాని, యింగులీషు దొరతనపువారు దాయవిభాగస్వత్వము నకుఁ బ్రతిబంధకమయిన యీవిధి నిషేధించిరి. (౧౮౫౦ ఆక్టు ౨౧)

మరణసంభావనఁబుట్టించు కాల పరిమితి।

౩౦౩. పోయినపోక దెలియఁబడక కానఁబడనివాఁడు గతించినవాఁడని సంభావించుటకు వానివయసుకొలఁదినిగా లపరిమితి భిన్నమయియుండును. ౩౦ది పండ్లవయస్సుగల వాఁడట్లు గానఁబడకపోయిన పక్షమందుమీఁద ౨౦ పండ్లకు గతించినవాఁడని సంభావింపఁబడును. ౩౦ మొదలుకొని ౬౦ పండ్లవాఁడయినపక్షమందు మీఁద ౧౫ పండ్లకును ౬౦ మీఁటి నవాఁడయిన పక్షమందు మీఁద ౧౨ సంవత్సరములకును వాఁడట్లు సంభావింపఁబడును. (౨. ౨౩౭, ౨౩౮కో)

అపరక్రియా కర్తృత్వము చేత వచ్చు దాయాధికారము।

౩౦౪. గతించినవానికపరక్రియలుచేయువారికి వాని దాయమందధికారము కలుగును. వానికిస్వబంధువులయందపరక్రియలుచేయ నర్హులయినవారే యుత్తరాధికారులు. అట్లుకానివారుత్తరాధికారులుకారు. (ఎల్. బర్లిన్గ్ ౬౭)

౩౦౫. అనర్హుఁడయిన బంధువుగతించినవానికపరక్రియలుచేసినపక్షమందు వానికి దాయభాగస్వత్వము లేదు. (౧. ౧౨౯, ౧౩౦)

౩౦౬. బంధువులైనస్త్రీలు కొందఱుమాత్ర మపరక్రియలుచేయవచ్చును, వారు వేదములు చదువఁగూడదుగనుక నొకరిచేతఁజేయింతురు.

పితృ పరోక్షమందు జాతునకు దాయసిద్ధి।

౩౦౭. దాయాధికారసిద్ధికి దాయాధికారిపుట్టియుండవలెనని యక్కఱలేదు. వాఁడుగర్భస్థుఁడై యుండుటచాలును. (ఎల్ బర్లిజ్ ౪౦)

పలుమెట్టు వరుసల దాయాధికారము

౩౦౮. సపిండులని సమానోదకులని బంధువులని దాయాదులు మూఁడువిధములవారు. సపిండులనఁగా గతించినవారికి జలముతోఁబిండ దానముచేయువారు. సమానోదకులనఁగా జలమాత్రదానము చేయువారు. తక్కినజ్ఞాతులు బంధువులనఁబడుదురు. (మితాక్షర ౨. ౫. ౬; ౨. ౬) సపిండులు లేనిపక్షమందు సమానోదకులు పిండదానముచేయుదురు. వారు లేనిపక్షమందు బంధువులు చేయుదురు.

౩౦౯. సపిండులు రెండువిధములవారు పిండములదానగ్రహణ సంబంధముగలవారు సమీపసపిండులు. చేతులయందంటుకొన్న పిండలేపముయొక్కదానగ్రహణ సంబంధముగలవారు దూరసపిండులు. సమానోదకులు సహితము రెండువిధములవారుగాని వారియుదకప్రదానమందు భేదములేదు. (మన్వర్థముక్తావళియందు మనువు ౫. ౬౦)

౩౧౦. ఒకనికి వెనుకటి యాఱవతరమువఱకుఁ బుత్రపరంపరవారును ముందాఱవతరమువఱకుఁ బితృపరంపరవారును తత్పితృపరంపరయొక్క యాఱవతరమువఱకుఁ బుత్రులును సపిండులనఁబడుదురు. సోదరులును వారియైదవతరముపర్యంతము పుత్రపరంపరవారును మూలపురుషుఁడైనతండ్రికి సంతతివారగుదురు. భార్య పుత్రికలు దౌహిత్రులు తల్లి పితామహియు సపిండవర్గములోనివారు. (సరస్వతీవిలాసము ; వరదరాజీయము ; స్మృతిముక్తాఫలము) ఇంతకంటె స్త్రీవర్గమందు సపిండులు లేరు. సపిండవర్గమందుఁ గడపటి సపిండుఁడు పుత్రపౌత్రప్రపౌత్రుఁడు,

సపిండులయొక్కయవధి।

౩౧౧. ఒకపురుషునకు వెనుకటి మూఁడు తరములవారును ముందు మూఁడుతరములవారును రెండవసారి చెప్పిన మూఁడుతరములవారి రెండవతరమువఱకు సంతతివారును సమీపసపిండులు. (స్మృతిచంద్రిక) భార్యపుత్రికలు పుత్రికాపుత్రులు తల్లి పితామహియు సమీపసపిండ వర్గములోని వారు. (స్మృతిముక్తాఫలము) పురుషునకుఁ బ్రపౌత్రునివఱకు సమీప సపిండులు. తక్కినవారు దూరసపిండులు.

సమీపసపిండులయొక్క—

౩౧౨. సపిండులగు పురుషులకు వెనుకటి యాఱుతరముల పురుషులును ముందాఱుతరముల పురుషులును వీరి వెనుకటి యాఱుతరముల పురుషులును సమానోదకులు. (మితాక్షర ౨. ౫. ౬ ; స్మృతిచంద్రిక ; స్మృతిముక్తాఫలము)

సమానోదకులయొక్క—

౩౧౩. ముందుచెప్పిన వర్గములోనివక్క దాయాదులందఱుకర్మకర్తతోఁడఁగూడి తమతండ్రికి సామాన్యముగానూ

కూడిపిండోదకదానము చేయుట।

లభూతుఁడయిన యొకానొక పురుషునికిఁ బైతృకకర్మము చే
యువారు కాఁబట్టి వీరిందఱని ముందు పరిగణించితిమి. ఇట్టు
చేయు పైతృకకర్మమే కూడి పిండోదకదానము చేయుటయనఁ
బడును.

బంధువులు।

౩౧౪. బంధువులు మూఁడు మెట్టువరుసలవారయియుం
దురు. మేనత్తకొడుకులు తల్లితోడఁబుట్టినదాని కొడుకులు
మాతుల పుత్త్రులును దనతోడిసరిమెట్టువారు. తండ్రియొ
క్క యావరుసవారు తండ్రిసరిమెట్టువారు. తల్లియొక్క
యావరుసవారు తల్లిసరిమెట్టువారు. వీరలీచెప్పినచొప్పునఁ
బరస్పరసంబంధముగలవారు. (మితాక్షర ౨. ౬)

దాయాధికారము యొక్క యానుపూర్వి।

౩౧౫. ఒకపురుషునియొక్క ద్రవ్యము మీఁదవివరించు
ప్రకారాన ముందఱసమీపసపిండులను బొందును—

పుత్త్రులు.
పౌత్త్రులు.
ప్రపౌత్త్రులు.
భార్య.
దుహితలు.
దౌహిత్త్రులు.
తల్లి.
తండ్రి.
సోదరులు.
సోదరపుత్త్రులు.
పితామహి.

పితామహుఁడు.

పితామహునిపుత్రులు (అనఁగాఁబితృవ్యులు)

పితామహునిపౌత్రులు (అనఁగాజ్ఞాతులు)

ప్రపితామహుఁడు.

వానిపుత్రులు.

వానిపౌత్రులు.

వీరివెనుక దూరసపిండులు తమతమ మెట్టువరుసను దాయాధికారులగుదురు. ఆతీరుననే వెనుకసమానోదకులు ను వారికివెనుక బంధువులును దాయార్హులగుదురు.

౩౧౬. ముందుచెప్పిన వరుసలోనివారు మూలపురుషుని ద్రవ్యమందు యథాపూర్వముగా స్వత్వముగలవారగుదురుగాని ద్రవ్యము పూర్వసంక్రాంతమయిన యనంతరమను క్రమముగా దాయార్హపరంపర యున్నపక్షమందుఁ గానేరదు. ఇందులకుదాహరణము. పుత్రాదులు లేనివాని ద్రవ్యము వానిసోదర పుత్రునికివచ్చి పిమ్మట వానిపుత్ర పరంపరకువచ్చునుగాని మొదటివానిపితామహికి రానేరదు. మఱియుఁ బుత్రికకుఁగాని మఱియొక బంధువురాలికిఁగాని వచ్చినద్రవ్యము వక్ష్యమాణవిధిప్రకారము దానియుత్తరాధికారులకు వచ్చును.

౩౧౭. తండ్రితోవిభక్తులైనను బుత్రులు తండ్రిపరోక్షమందు వానిద్రవ్యమందు వీరుచేరువ యుత్తరాధికారులు కాఁబట్టి భాగస్వత్వముగలవారగుదురు (౧. ౧౭౩) పుత్రులు।

౩౧౮. విభాగానంతరము పుత్రులు పుట్టిరేని వారికేతం డ్రిభాగము వచ్చును. (౧. ౧౮౨)

౩౧౯. పుత్రులకందరికి భాగము తుల్యముగాని మాతృసంఖ్యనుబట్టి విభాగమునకు వైషమ్యము కలుగదు. (౧. ౨౦౫) ఈవిధి సర్వవర్ణములవారికి సమానము. (స. అ. ౧౮౪౬ రి. అ. నం. ౨౦ లోతీర్పు)

౩౨౦. ఈకాలము జ్యేష్ఠపుత్రునికి భాగమధికము లేదు. (౧. ౧౩౩) రాజ్యము పురాతనపుజమీనులును జ్యేష్ఠపుత్రునికి వచ్చును. (స. అ. ౧౮౪౬ రి. అ. నం. ౨౦ లోతీర్పు)

పౌత్రులు ప్రపౌత్రులు.

౩౨౧. పౌత్రప్రపౌత్రులును దమతమతండ్రుల భాగానురూపముగా భాగములు పొందుదురు. (౧. ౨౦౭)

౩౨౨. తండ్రిపోయిన పౌత్రుఁడు, తండ్రి తాతలుపోయిన ప్రపౌత్రుఁడును విభాగించుకొను పక్షమందు జీవించియున్న పుత్రునితో విభాగించుకోవలసినది. (౨. ౨౫౩ ; శ్రీకృష్ణుఁడు)

ప్రపౌత్రుఁడు

౩౨౩. విభాగకాలమందుఁ బుత్రపౌత్రప్రపౌత్రులు లేక ప్రపౌత్రపుత్రుఁడుండెనేని వీనికిదూరసపిండతవలని స్వత్వము గలదు. దాయము చచ్చినవాని భార్యకు వచ్చును. ప్రపౌత్రుఁడు జీవితుఁడై దాయముపొందెనేని వానిపుత్రునికే యదిచేరును. (౧. ౧౨౫)

కానఁబడక పోయిన వాని దాయ స్వత్వ

౩౨౪. ఒకఁడు చిరకాలము పోయినపోకు తెలియక గతించినాఁడని సంభావింపఁబడి వానిసంతతివారు సహితము

న్నసమాచారము తెలియఁబడకయుండఁగా వానియాఋత రములలోపల సంతతివాఁడెవ్వఁడుగాని వచ్చినపక్షమందు దాయహారిత్వము ముందుగావానికి వచ్చునుగాని యావితంతువునకుఁ గలుగదు. (౧. ౧౨౫, ౧౩౨) ఈపరంపరయందీ దూరసపిండునకు ముందువాఁడెవఁడయినను సమక్షమందు జీవించియుండి దాయముపొందిన పక్షమందాదాయము వీనికే యనుక్రమముగా వచ్చునను సంభావనచేతవీనిదాయహారిత్వ మొప్పకొఁబడియె.

ము నివర్తింపదు।

౩౨౫. విభాగయోగ్యకాలమునకు ముందుగతించినపుత్రునియొక్క భాగము వానిభార్యకు రానేరదు. (౨. ౨౩౧, ౨౩౨ కో, డోరిక)

గతించినపుత్రునియొక్క భాగము।

౩౨౬. ఒక్కనికనేక భార్యలున్నపక్షమందు వానిద్రవ్యము ముందుగా మొదటిభార్యకు వచ్చుననియు దానికివెనుకఁదక్కినభార్యలకుఁ బెండ్లివరుసచొప్పున యథాపూర్వముగా వచ్చుననియుఁ దీర్పుచేయఁబడియున్నది. (౧. ౧౩౬, ౧౩౭; స. అ. ౧౮౨౪ రి. అ. నం. ౫లో; ౧౮౩౫ రి. అ. నం. ౧లో తీర్పులు) ఈతీర్పుద్రవిడాచారమందు శాస్త్రీయముకాదు కాఁబట్టిభార్యలందఱు భర్తృద్రవ్యవిభాగమందు సమానస్వత్వముగలవారైయుందురు. (మితాక్షర ౨. ౧. ఈ వచనముకోల్ బ్రూక్ దొరగారు భాషాంతరముచేసినగ్రంథమందు ౫వ వచనమునకు ౬వ వచనమునకు నడుమువిడిచిపోయినది; స్మృతిచంద్రిక)

భార్యలు।

౩౨౭. పుత్రికలుగల వితంతువులుస్థావర ద్రవ్యము స

ము ముగాఁ బంచుకొందురు. అదిపుత్రికలులేని వితంతువుస కు రానేరదు జంగమద్రవ్యమందఱకు సమానమ్ముగావచ్చు ను. (సరస్వతీవిలాసము)

పుత్రికలు। ౩౨౮. పుత్రికలయందు వివాహములేనివారు ముందు దాయముఁబొందుదురు. పిమ్మటఁబుత్రసంతతికలవారేనిపు త్రులను గనఁదగినవారేని సభర్తృకలును సపుత్రలయిన వి తంతువులును బొందుదురు. ఈ వెనుకటి మూఁడుతరగతుల వారు సమానస్వత్వముగలవారు. (స్మృతిచంద్రిక)

౩౨౯. వీరికి వెనుక వంధ్యలయి సభర్తృకలయిన పుత్రి కలును బుత్రులులేని వితంతువులయిన పుత్రికలును దాయ ముపొందుదురు. వీరును సమానస్వత్వముగలవారు. (మితా క్షర ౨. ౧౧. ౧౩)

౩౩౦. ఆయా తరగతియందు ధనము కలదానికంటె ముందు ధనములేనిదానికి దాయముచేరును. (మితాక్షర ౨. ౧౧. ౧౩) ఇంతపాటిధనముగలదానికి దాయమురానేరదని ధనముయొక్క పరిమితిచెప్పఁబడలేదుగాని తుదకాధనము స హజముగా జీవనమునకుఁజాలినంతపాటి యుండవలసినది.

౩౩౧. ముందుచెప్పిన యాయాతరగతులయందుఁ బు త్రికలందఱు సమానముగా భాగస్వత్వముగలవారు. (స. అ. పం. ౧౮౫౭ ౨ మే ౨౦) ఇదితండ్రివలనవచ్చిన దాయాధి కారమును సంబంధించినదని తెలియవలసినది. తండ్రికనేక భార్యలున్నపక్షమందుఁ బుత్రికలు తమతమతల్లిభాగముఁ బొందుదురు. (స. అ. పం. ౧౮౫౪ జూలై ౩)

౩౩౨. ఈదాయస్వత్వము పుత్రికల పుత్రసంతతికిసం క్రమించునుగాని పుత్రికాసంతతికిఁజెందదు. (పెద్దఘేక్ నాటక ౬) పుత్రికాపుత్రికలు।

౩౩౩. దుహితలయొక్క పుత్రులు తమతమతల్లులయొక్క భాగముకొలఁదిని భాగించుకోవలసినవారు. (౧. ౧౪౫) దౌహిత్రులు।

౩౩౪. దౌహిత్రులకు దాయముకలుగదు. (స. కో. ౧౮౬౧ స్వె. అ. నం. ౨౪౬లో తీర్పు)

౩౩౫. శూద్రులయందు దౌహిత్రులు లేనిపక్షమందుఁ జేరుగొండి దానికొడుకులకుఁ బూర్ణభాగము చెల్లును. (౧. ౧౩౨) ఉన్నపక్షమందర్ధభాగముచెల్లును. శూద్రులచేరుగొండి కొడుకులు।

౩౩౬. పితృపరంపరయందుఁ దండ్రికిముందు దల్లి ద్రవ్యమునుబొందును. (స. అ. పం. ౧౮౩౮ డిసెంబర్ ౨౪) తల్లులు।

౩౩౭. తండ్రికనేక భార్యలున్నపక్షమందు వారిలో సవతితల్లులకు గతించినవాని ద్రవ్యమురానేరదు. వానితల్లికేవచ్చును. (౧. ౧౪౪)

౩౩౮. భ్రాతలయందేకోదరులు ముందుగా దాయాధికారము పొందుదురు. వారులేనిపక్షమందు భిన్నోదరులు పొందుదురు. (౧. ౧౪౪) సోదరులు।

౩౩౯. విభక్తులయినసోదరులుపునస్సంసృష్టులయియుండి ఘరలవిభాగించుకొనునప్పుడు సంసృష్టి కాలమునగతించిన వానిభాగము సంసృష్టులైయున్నయేకోదరులకును వానితోఁ బుట్టువులైనస్త్రీలకును సమానముగాఁజెందును. ఏకోదరు

లు లేనిపక్షమందు వారితోఁబుట్టువులైన స్త్రీలకును భిన్నో దరులకును సమానముగావచ్చును. (మితాక్షర ౨. ౯. ౧౩)

తోఁబుట్టువులయిన స్త్రీలు।

౩౪౦. మీఁదఁజెప్పినరీతిని నర్హతగలవారు తప్ప తోఁబుట్టువులయినస్త్రీలు భాగగ్రాహిపరంపరలోనివారు కారు. (౨. ౨౪౩, ౨౪౪ కోల్ బ్రూక్, సదర్ లాస్డు)

౩౪౧. మృతునికిఁ దోఁబుట్టువులయిన స్త్రీలును దత్పుత్రులును నపరక్రియలు చేయవచ్చునుగనుక దాయాధికారులు లేనిపక్షమందు వారికిస్వత్వముకలదని సదరుకోర్టుపండితులువాదించెదరు. (౧౮౫౯ ఆగస్టు ౨౪ ; ౧౮౬౧ అక్టోబర్ ౩౦) ఈవాదమనుమితమనియుఁ దోఁబుట్టువులయినస్త్రీలను వారిపుత్రులను దాయపరంపరలో గణింపని మితాక్షరకు సాక్షాద్విరుద్ధమనియు సదరుకోర్టువారు దానినంగీకరింపరైరి (స. కో. ౧౮౫౮ స్పె. అ. నం. ౧౧౮ ; ౧౮౫౯ స్పె. అ. నం. ౧౦౭ ; ౧౮౬౦ స్పె. అ. నం. ౧౮౪లో తీర్పులు)

సోదరులపుత్రులు।

౩౪౨. సోదరులపుత్రులయందే కోదరభ్రాతృపుత్రులు భిన్నోదరభ్రాతృ పుత్రులకంటె ముందుపొందుదురు. (౧. ౧౪౫) మఱియవిభక్తులు విభక్తులకంటె ముందుపొందుదురు. (౨. ౨౫౪ శ్రీకృష్ణుఁడు) ఆయాతరగతివారుపితృసంఖ్యానురూపముగాభాగముపొందుదురు.(మితాక్షర. ౨.౪.౭—౯)

౩౪౩. గతించినవానిద్రవ్యము జీవితులయిన తనసోదరులకువచ్చునుగాని యట్లువచ్చుటకుముందు గతించినసోదరులయొక్క పుత్రులకురానేరదు. (పెద్దమెక్నాటన్ ౩ ; ఎల్బర్లింగ్ ౪౮)

౩౮౪. సోదరపౌత్రులు సాక్షాద్దాయగ్రాహి పరంపర లోనివారుకారు. (ఎల్ బర్లిజ్ ౭౮) అయినను వెనుక వీరు దూరసపిండత్వముచేత నగుదురు.

సోదర పౌత్రులు।

౩౮౫. సోదరుల పుత్రికలకు దాయముగా నేరదు. (౨. ౨౩౯, ౨౪౦; సదర్ లాన్ డు)

సోదరులపుత్రికలు।

౩౮౬. అత్తకుఁ గోడలపరక్రియలుచేయవచ్చునుగాఁ బట్టి యామెద్రవ్యము కోడలికివచ్చునని సదరుకోర్టుపండితులు చెప్పెదరుగాని యీమతమును సదరుకోర్టువారంగీకరింపరైరి. తోఁబుట్టువులనువారి పుత్రులను దాయపరంపరయందు గ్రహింపనినిమిత్తములే దీనికినవుచున్నవి. (స. కో. ౧౮౫౮ రి. అ. నం. ౩౩లో తీర్పు)

కోడండ్రు।

౩౮౭. అవిభక్తులయినసోదరులయొక్క దాయముపొందువారి పరంపర విభక్తుని దాయముపొందువారి పరంపరకంటెఁ గొన్నివిషయములందు భిన్నమయియుండును. ఆయా సోదరునకు రావలసినభాగము క్రమముగా వానివానిపుత్రపౌత్రప్రపౌత్రులకు విభక్తద్రవ్యమట్లుచేరును. వీరులేనిపక్షమందు వానిభాగము వానిసోదరులకుసమానముగాఁజేరును. గతించిన సోదరునియొక్క భాగము తనతండ్రికిఁగాని తాతకుఁగాని సంక్రమింపనిది ప్రపౌత్రపుత్రునికి రానేరదు. సోదరులకువచ్చినభాగము వారిసంతతియందుఁ బ్రపౌత్రునివఱకువచ్చును. ఆసంతతివారు లేనిపక్షమందు వారిలోఁగడపట గతించిన వానియొక్క భార్యకువచ్చును. ముందుగతించిన వారి భార్యలకు భాగమురాదు. అవిభక్తులైన సోదరులయొ

అవిభక్తకుటుంబములయందుదాయమువచ్చు క్రమము।

క్క పుత్రపరంపరయందు దూరతములైన యవిభక్తజ్ఞాతుల వఱకు నాభాగము చేరును. వీరందఱు లేనిపక్షమందుఁ గడపట గతించినవాని భార్యకుఁజేరవలసినది. అదిలేనిపక్షమందు విభక్తులను జెందును. (౧౮౫౮ స్పె. అ. ౧౬౯ నం. స. కో. తీర్పు)

౩౪౮. అవిభక్తులైన దూరబంధువులు గతించినవానిభార్యకంటె ముందుపొందుదురు. (స. పం. ౧౮౨౯ సెప్టంబరు. ౧౨)

౩౪౯. అవిభక్తసోదరులలో ముందొకఁడు గతించెనేని సముదాయద్రవ్యము సమస్తము జీవితునికిఁ జేరునుగాఁబట్టి యట్టిసోదరులిద్దఱును సంతులేక యుండి వరుసగా గతించిరేని వానిభార్యలలోఁగడపట గతించిన వానిభార్యకే యాద్రవ్యమువచ్చును. (౨. ౨౩౧. ౨౩౨ కో, డోరిది)

౩౫౦. అవిభక్తులయిన యిద్దఱు సోదరులలో గతించిన వానిపుత్రికకు దాయము రానేరదు. ఆద్రవ్యము జీవితుఁడయినసోదరునికివచ్చును. వెనుక వానిపుత్రపరంపరను జెందును. (స. పం. ౧౮౫౩ అక్టోబరు ౨౪)

అంశకునియొక్క స్వార్జిత ద్రవ్యము।

౩౫౧. ఒకయంశకునియొక్క స్వార్జితద్రవ్యము సర్వము స్థావరముగాని జంగమముగాని వాని ప్రపౌత్రపర్యంతము పుత్రపరంపరవారిని జేరును, (స. పం. ౧౮౩౮ జూను ౧౫; ౧౮౫౦ నవంబరు ౭) పుత్రసంతతిలేనిపక్షమందాద్రవ్యము వానియవిభక్తసోదరులను జేరి వారిపరంపరను జేరును. (స. పం. ౧౮౩౭ జనవరి ౧౬)

౩౫౨. దత్తునిద్రవ్యము స్వీకర్తకుటుంబ పరంపరలో నెవ్వరును లేనిపక్షమందు వానిజనకపిత కుటుంబపు బంధువులను జెందుననియు జనకపితసంతతి వా రెవ్వరును లేని పక్షమం దాద్రవ్యముస్వీకృతుని జెందుననియుసదరు కోర్టుపండితులు చెప్పెదరు. అప్రామాణికమయిన దత్తకమీమాంస యనుగ్రంథమందు శ్రీరామపండితులు వాదించు వాదమున ననుసరించి యట్లుచెప్పిరి గాని యదినందపండితుఁడు దేవ నాథభట్టు స్వీకారవిషయమై రచియించినగ్రంథములయందుఁ జెప్పఁబడియుండకపోవుటయే కాక మనువచనమునకు సాక్షాద్విరుద్ధమగుటచేత స్వీకారము వలనస్వీకృతునికిని జనకపితకును గలిగిన వియోగముత్రిప్పరాని దగుటచేతను సదరుకోర్టు పండితులమతము సమ్మతింపఁబడదు. (స. కో. పం. ౧౮౫౫ అక్టోబరు. ౯; ౧౮౫౪; ఆగస్టు ౨౪ స. కో. ౧౮౫౫ స్పె. అ. నం. ౧౯౨లోతీర్పు; హై. కో. ౧౮౬౧ స్పె. అ. నం. ౧౪౪. ౧౮౭లోతీర్పులు) మఱియు శ్రీరామ పండితులు వంశపరంపరయందు జనకపితవంశస్థులను దాయమువిషయమైయెవ్వరియందును జేర్పలేదు. భార్యకుముందని పండితులుచెప్పెదరుగాని యదిప్రామాణిక గ్రంథమయిన మితాక్షరయందుఁజెప్పఁబడిన దాయపరంపరకు సాక్షాద్విరుద్ధము.

దత్తపుత్రుఁడు।

౩౫౩. విభక్త కుటుంబములయందు స్త్రీలు దాయము పొందుదురు. (ఎల్ బర్లిజ్ ౬౮) అవిభక్త కుటుంబములయందుఁబురుషపరంపర లేనిపక్షమందు దాయముపొందుదురు.

స్త్రీలుదాయము పొందుట।

౩౫౪. స్త్రీ కేవిధమునఁగాని వచ్చినద్రవ్యము ముఁదు

స్త్రీధనము

సంక్రమించుట.

గాఁదనపుత్రికలను జెందును. అందువివాహితలకంటెముందు వివాహము లేనివారికిని ధనముగలవారికంటె ముందు ధనములేనివారికిని జెందును. పిమ్మట దానిపుత్రికాపుత్రికలకును; దౌహిత్రులకును; పుత్రులకును; పౌత్రులకును; (౧. ౫౧మితాక్షర ౨. ౧౧. ౯,౧౩) పుత్రులులేనివారికంటెముందుపుత్రవతులకును బుత్రవతులు కాఁగలవారికిని జెందును. (స్మృతిచంద్రిక) వీరులేని పక్షమందు భార్యకువచ్చిన భర్త ద్రవ్యము పెనిమిటివంకవారికి వరుసగాఁ జెందును. నిషిద్ధములైనయాసుర రాక్షస పైశాచములయందొక్క వివాహముజరిగినస్త్రీ తనతల్లిదండ్రులనుండి పొందినధనము వారు జీవించి యున్నపక్షమందు వారిని జెందును. వారు లేనిపక్షమందు భర్తకును వానివంకవారికిని వరుసగావచ్చును. సమ్మతింప బడిన బ్రాహ్మదైవార్షప్రాజాపత్య గాంధర్వములను వివాహములలో నొకవివాహముజరిగినస్త్రీ తనతల్లిదండ్రులువలననుండి పొందినధనము వారినిజెందక భర్తకును వానివంకవారికిని వరుసగావచ్చును. (౧. ౫౧; మితాక్షర ౨. ౧౧. ౧౧; స్మృతిచంద్రిక)

పారితోషికము.

౩౫౫. వివాహకాలమందు గృహోపకరణములు పశువులు మొదలగువానిని గొనుటకయి వరుఁడు భార్యకిచ్చిన పారితోషికద్రవ్యము (స్మృతిచంద్రిక; వ్యవహారమయూఖము) మాత్రముదానిసోదరులకుఁజేరును. (౧. ౫౧, ౨౫౦)

కన్యకధనము.

౩౫౬. కన్యగతించెనేని దానిని వివాహముచేసికొననిశ్చయించినవరుఁడు దానిపైఁడిముడుపుకైయిచ్చినద్రవ్యమే

దిగాని వానికి మరలింపవలసినది. ఉభయపక్షములవారి సేలవులు దానియందుఁ ద్రోపుచు పెట్టవలసినది. దానియితరద్రవ్యము వానిసోదరులకుఁ జేరును. పిమ్మటఁ దల్లిదండ్రులకుఁ జేరును. (మితాక్షర ౨. ౧౧. ౩౦)

౩౫౭. పుత్రికాపుత్రికలు మాతృసంఖ్యాను రూపముగా దాయాంశముపొందుదురు. (మితాక్షర ౨. ౧౧, ౧౬)

మనుమరాండ్రు।

౩౫౮. బంధువులెవ్వరును లేనిపక్షమందుఁబురుషునిద్రవ్యము వాని యుపాధ్యాయునికిఁగాని శిష్యునికిఁగాని సతీర్థ్యునికిఁగాని వరుసగాఁ జేరును. బ్రాహ్మణేతరవర్ణములయందట్టిద్రవ్యము దొరతనమువారికి జేరును. మితాక్షర ౨. ౭.) బ్రాహ్మణీకానిస్త్రీకి బంధువులు లేనిపక్షమందు దానిద్రవ్యము దొరతనమువారికిఁ జేరును.

బంధువులు లేనిపక్షమందు దాయము వచ్చుక్రమము।

౩౫౯. బ్రాహ్మణుల యందు బంధువులులేని పక్షమందుఁబురుషునిద్రవ్యముగాని స్త్రీద్రవ్యముగాని శ్రోత్రియుఁడగు గురువునకు సద్బ్రాహ్మణునికిని వరుసగాఁ జేరును. (మితాక్షర ౨. ౭. ౩—౫) అయినను ప్రివికౌన్సల్ వారా ద్రవ్యమితర స్థితులవలెనే రాజునకుఁ జేరునని ప్రకటించి యున్నారు. (౧౮౬౦ జూలాయి ౩౦ యందుఁగావలి వెంకటనారాయణప్ప మీఁద బందరు కలెక్టరు తెచ్చిన వ్యవహారము)

రాజు బ్రాహ్మణుని ద్రవ్యముఁబొందఁగూడదని మనువచనమందు స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. బ్రాహ్మణుని ద్రవ్యమువానిమరణానంతరముదాయాధికారి లేనిపక్షమందు బ్రా

హ్మణునికే యిప్పింపవలెను. ఈయనియెడ రాజునుఁబాపము జుట్టుకొనునని నారదవచనముగలదు. (మితాక్షర ౨. ౭. ౫)
హిందూశాస్త్రమిట్లుస్పష్టముగాఁ జెప్పియుండినను ప్రివికౌన్సల్ వారుదానికి విపరీతార్థముఁజేయుచున్నారు. బ్రాహ్మణద్రవ్యము శ్రోత్రియుఁడగుసద్బ్రాహ్మణునిఁ జెందుననుటచే నట్టివానినేర్పఱుచు నధికారమొకనికిఁగలిగియున్నదనియు నట్లుద్రవ్యవినియోగముఁ జేయనిపక్షమందు రాజును దురితమొందునుగాఁబట్టి యాయధికారము రాజునందున్నది కావున నట్టివాని నేర్పఱుచునంతవఱకు ద్రవ్యాధికారము రాజునందున్నది, గనుక దాయాధికారులులేని బ్రాహ్మణుని ద్రవ్యము తక్కినవాని ద్రవ్యమువలెనే రాజును జేరవలసియున్నదిగాని యంతకంటెగొప్పస్వాతంత్ర్యములేనివానికిఁజెందదని ప్రివికౌన్సల్ వారు వాదించెదరు. ఇట్లువాదించి పిమ్మటనీయంశము సాధారణనిబంధనలప్రకారము దీర్పవలసినది కాని హిందూధర్మశాస్త్రప్రకారము గాదనిస్పష్టముగాఁ జెప్పెదరు.

ఇట్లువాదించినను మదకు హిందూశాస్త్రముచెప్పిన నెప్పుడుగాని రాజుపుచ్చుకొనఁగూడనిదియుఁ బుచ్చుకొన్నపక్షమందుఁ బాపముపుట్టించునదియు నగుద్రవ్యము బ్రిటిష్‌దొరతనము వారికాలమునందు రాజునేచెందుఁగాని శాస్త్రమందుఁ జెప్పఁబడినవారికిఁ జెందదని యేర్పడుచున్నది.

విరక్తులయొక్కద్రవ్యము। ౩౬౦. లోకబంధములు వదలినవిరక్తులద్రవ్యము వారి యాత్మసంబంధులైన తోడివారికిఁజేరును. బ్రహ్మచారియొ

క్క ద్రవ్యము వానియుపాధ్యాయునకుఁ జేరును. సన్న్యాసి యొక్క ద్రవ్యము గుణశాలియయినవానిశిష్యునకుఁ జేరును. వానప్రస్థుని ద్రవ్యము వానప్రస్థాశ్రమము పొందఁగలవాఁ డైనవానితోడి వానికిఁ జేరును. తుదకెవరికిఁగాని సమాశ్రమముగలవానికిఁ జేరును. బంధువులకుఁ జేరనేరదు. (మితాక్షర. ౨. ౮. ౧—౬)

౩౬౧. వేశ్యయొక్క ద్రవ్యము దానిపుత్రికా పరంపర వారికిఁ జేరును. వారు లేనిపక్షమందుఁగుల స్త్రీధనమువలె దానిపుత్రసంతతివారికిఁ జేరును.

వేశ్యలయొక్క—

౩౬౨. సంతులేనివేశ్యలయొక్క ద్రవ్యము వారుసేవించుగుడికిఁ జేరును. (స. పం. ౧౮౫౩ సెప్టంబర్ ౧౨)

౩౬౩. చేరుగొండిబాంధవ్యము పోగొట్టుకొన్నదికాఁబట్టిదాని ద్రవ్యము కులమునందుఁ బుట్టినబిడ్డలు మొదలయినవారికెవ్వరికిఁగాని చేరదు. (స. కో. ప్రొ. ౧౮౪౪ నవంబర్ ౧౧; స. ది. అ. ౭. ౨౭౩) వెనుకఁబుట్టినసంతతివారికిఁ జేరును.

చేరుగొండ్లయొక్క—

## ౧౨. ప్రకరణము.

### బంగాళశాస్త్ర సంప్రదాయము.

బంగాళకాశీశాస్త్ర సంప్రదాయ భేదము.

౩౬౪. బంగాళదేశమందాచరించుచున్న శాస్త్రసంప్రదాయమునకును ద్రవిడాది సంప్రదాయముల తోడిదియయిన కాశీశాస్త్ర సంప్రదాయమునకునుగల ముఖ్యభేదములుమీఁదవివరింపఁబడును.

పుత్రస్వీకారమునందు వితంతువునకనుజ్ఞ.

౩౬౫. వితంతువునకుఁ బుత్రస్వీకారము చేయుటయందు భర్తయనుజ్ఞలేక బంధువులయొక్క యనుజ్ఞమాత్రము చెల్లును. (దత్తకమీమాంస ౧. ౧౮) ఇదివ్యవహారమయూఖములో ౪. ౫. ౧౭ నకువిరుద్ధము. (౨. ౯౨ కో) శ్రీరామపండితులదత్తకమీమాంసకువిరుద్ధము.

స్థావరద్రవ్యమందుఁదండ్రియొక్క యధికారము.

౩౬౬. పైతృకమైన స్థావరద్రవ్యమందు నల్పాంశము తండ్రి తనయిచ్ఛకువచ్చినట్టు వినియోగింపవచ్చును. (దాయభాగమందు ౨. ౨౪) ఇదిమితాక్షర. ౧. ౫. ౯, ౧౦లో పుత్రులయనుమతిలేక యేమాత్రముగాని వినియోగింపఁగూడదని ప్రతిషేధింపఁబడినది.

అశాస్త్రీయములైన వినియోగములు.

౩౬౭. శాస్త్రనిషిద్ధమైనను ద్రవ్యవినియోగమించికడచిపోయినది ప్రతిషేధింపఁబడదు. చేసినపనినూఱుప్రతిషేధములచేతనయినను వారింపఁబడదుగదా. (దాయభాగము ౨. ౩౦) ఈసిద్ధాంతము కాశీసంప్రదాయమందు సమ్మతముగాదు. (౧. ౨౩, ౨౪; స్మృతిచంద్రిక)

తండ్రిద్రవ్య

౩౬౮. తండ్రిజీవించియుండువఱకు వానియొక్క పైతృ

కద్రవ్యమందుఁగాని యితరమందుఁగాని పుత్రునకుస్వత్వ ము లేదు. (దాయభాగము ౧. ౩౦ ; ౨. ౯, ౧౧) ఇదిమితాక్షరయందు ౧. ౧. ౩, ౨౩, ౨౭ లకువిరుద్ధము.

మందుఁబుత్రులస్వత్వము।

౩౬౯. తమకుస్వత్వము లేదుగాఁబట్టి పుత్రులుతండ్రులను వారిపైతృకద్రవ్యమునకు సహితము విభాగముకై బలాత్కరింపఁగూడదు. ఈకార్యము తండ్రియొక్క యిచ్ఛాధీనము. (దాయభాగము ౧. ౩౮ ; ౨. ౨౦) ఇదిమితాక్షరయందు ౧. ౨. ౭. నకువిరుద్ధము. (౧. ౧౭౯)

పుత్రుఁడువిభాగముకై తండ్రినిబలాత్కరింనునధికారము।

౩౭౦. పైతృకద్రవ్యము తండ్రిపుత్రులతోఁ భాగించుకొన్నపుడు వానికి రెండుభాగములు రావలసినది. (దాయభాగము ౨. ౨౦) ఇదిమితాక్షరయందు ౧. ౫. ౫లోఁ బితాపుత్రులకు సరిభాగములని చెప్పి ప్రతిషేధింపఁబడియున్నది.

తండ్రియొక్కభాగము।

౩౭౧. తండ్రికొడుకులకు భాగము తీరినవెనుకఁబుట్టిన పుత్రునకు సోదరులయొక్క భాగములయందు భాగమురావలసినది. (దాయభాగము ౭. ౧౦—౧౨) ఇదిమితాక్షరయందు ౧. ౬. ౨లో ఆభాగము తండ్రిభాగమున రావలసినదని చెప్పినపట్టుకలకు విరుద్ధము.

విభాగమునకు వెనుకఁబుట్టినపుత్రునికి భాగము।

౩౭౨. విభాజ్యమైనద్రవ్య మొకయంశకుఁడు దాఁచుటచేత వానికి దాయాంశమునందు స్వత్వముపోనేరదు. (దాయభాగము ౧౩. ౨) ఇదిమితాక్షర ౧. ౯. ౪, ౫కు విరుద్ధము.

పాలివాఁడు ద్రవ్యము దాఁచుట।

౩౭౩. వంధ్యలైన పుత్రికలకును బుత్రహీనలైవితంతువులైనపుత్రికలకును దండ్రియొక్క ద్రవ్యమందు స్వత్వము

వంధ్యలైన పుత్రి కలకుఁ బుత్ర హీనల

యివితంతువులైన పుత్త్రికలకును।

లేదు. (దాయభాగము ౧౧. ౨. ౩) ఇదిమితాక్షర. ౨. ౨లోను ౨. ౯. ౧౩లోను బ్రతిషేధింపఁబడినది.

తల్లికిముందు తండ్రికిస్వత్వము।

౩౭౪. ఆరోహణక్రమమందుఁ దల్లికంటెముందు తండ్రిదిస్వత్వము. అవ్వకంటెముందు స్వత్వముతాతది. (దాయభాగమందు ౧౧, ౪. ౩, ౪) ఇదిమితాక్షర ౨. ౩. ౫లో సాక్షాద్విరుద్ధమయిన వచనముచెప్పి ప్రతిషేధింపఁబడినది.

సోదరులపౌత్త్రులు।

౩౭౫. సోదరుల పౌత్త్రులుత్తరాధికారులలోఁజేరినవారు. (దాయభాగము ౧౧. ౬. ౬) ఇదిమితాక్షర ౨. ౫. ౧. యందు వారుత్తరాధికారులుకారని ప్రతిషేధింపఁబడిరి.

భాగినేయులు।

౩౭౬. భాగినేయులు సహితముత్తరాధికారిపఙ్క్తిలోనివారు. (దాయభాగము ౧౧. ౬. ౮, ౯) ఇదిమితాక్షరకువిరుద్ధము. (౧. ౧౪౭) దీనియందుత్తరాధికారుల పఙ్క్తిలో వీరినిగానము.

గతించినయవిభక్తుని యొక్కభార్య।

౩౭౭. తనపాలివారితో భాగించుకొనికాని భాగించుకొనకకాని పుత్త్రహీనుఁడై గతించినవానియొక్క ద్రవ్యము వానిభార్యకుఁజేరును. (దాయభాగము ౧౧. ౧. ౪౬) ఇది మితాక్షరయందు ౨. ౧. ౩౦కి విరుద్ధము. దీనియందు విభక్తుఁడైగతించినవాని ద్రవ్యమే వానిభార్యకుఁ జేరునని చెప్పఁబడియున్నది. (౧. ౧౨౧)

సౌదాయకము।

౩౭౮. స్త్రీకిమాత్రము స్వత్వముగలధనము స్త్రీధనమనఁబడును. (దాయభాగము ౪. ౧. ౧౩—౨౦) మితాక్షరయందు (౨. ౧౧. ౩, ౫) ఏవిధముననేని స్త్రీకివచ్చినద్రవ్య

ము స్త్రీధనమనియు స్త్రీకిమాత్రము స్వాతంత్ర్యముఁగలధన ముసౌదాయకమనియుఁ జెప్పఁబడును.

౩౭౯. వివాహమందు భర్తవలనవచ్చినదియని యితరులవలన వచ్చినదియని స్త్రీధనము మరలద్వివిధము. మొదటిది యౌతకమనఁబడును. అయౌతకమని రెండవది చెప్పఁబడును. (దాయభాగము ౪. ౨. ౧౩, ౧౪) ఈ భేదము మితాక్షరయందుఁగానము.

౩౮౦. స్త్రీయొక్క యౌతక ద్రవ్యము పుత్రికలకుఁ జేరును. అందు మొదట వివాహములేనిదానికి వెనుకనిశ్చితార్థమైనదానికిని గడపట వివాహమైనదానికిని జేరును. పుత్రికలు లేనిపక్షమందుఁ బుత్రులకుఁజేరును. (దాయభాగము ౪. ౨. ౧౩, ౨౩, ౨౫) స్త్రీయొక్క తక్కిన ద్రవ్యము దానిపుత్రులకును నిశ్చితార్థముగానికన్యలైన పుత్రికలకును సమముగాఁజేరును. వీరియందొకరు లేనిపక్షమందుమఱియొకరినిఁ జెందును. వారు లేనిపక్షమందుఁ బుత్రవతియయిన వివాహితకుఁగాని పుత్రవతి కాఁగలదానికిఁగాని చెందును. పిమ్మట దానిపుత్రపుత్రునికిఁజేరును. పిమ్మటదానిపుత్రికాపుత్రునకుఁ జేరును. పిమ్మటవంధ్యలయినపుత్రిలకును వితంతువులైన పుత్రికలకును జేరును. (దాయభాగము ౪. ౨. ౯, ౧౧. ౧౨) భర్తయొక్క ద్రవ్యము స్త్రీకివచ్చినపక్షమం దాద్రవ్యము పిమ్మట వానియుత్తరాధికారులను జెందును. అందుముందు పుత్రికలను జెందును. ఈ ద్రవ్యము దానిస్వద్రవ్యముపొందు దాయాదులను జెందదు. (దాయభాగము ౧౧. ౧. ౫౬,

౫౭) ఇది మితాక్షరయందు ౨. ౧౧. ౯, ౧౩ నకువిరుద్ధము. ఏవిధముచేతవచ్చినదిగాని స్త్రీధనము పుత్త్రికలను జెందున ని యందు వివాహితకంటె ముందువివాహములేనిదానిని ధ నముకలదానికంటెముందు ధనము లేనిదానిని జెందునని వీరు లేనిపక్షమందుఁ బుత్త్రికాపుత్త్రికలకును బుత్త్రికాపుత్త్రులకును జేరునని వీరులేనిపక్షమందుఁ బుత్త్రులకును బౌత్త్రులకును జే రుననియు మితాక్షరయందుఁజెప్పఁబడినదిగానిముందుచెప్పి న భేదము కానము.

బంధువులు లేని పక్షమందుద్రవ్య సంక్రాంతి।

౩౮౧. సతీర్థ్యుఁడు లేనిపక్షమందు ద్రవ్యముసగోత్రు నకుఁ జేరును. వాఁడు లేనిపక్షమందు సమానప్రవరునకుఁజే రును. వాఁడు లేనిపక్షమందు గురువులకు సమానగ్రామవా సులైన బ్రాహ్మణులకును జేరును. వారు లేనిపక్షమందు బ్రా హ్మణేతరుల ద్రవ్యము రాజును జెందును. (దాయభాగము ౧౧. ౬. ౨౫—౨౭) ఇదిసతీర్థ్యుఁడు లేనిపక్షమందు బ్రాహ్మ ణద్రవ్యము బ్రాహ్మణులకే చేరునని యితరవర్ణములవారిద్ర వ్యము రాజును జేరునని చెప్పినమితాక్షరయందు ౨. ౭. ౩— ౬ నకువిరుద్ధము.

## ౧౩. ప్రకరణము.

### మళయాళదేశశాస్త్రము.

౩౮౨. మళయాళదేశపు జనులయందు దాయాదపరంపరకుఁ గన్నరాదేశముదప్ప నీరాజధానిక్రింది యితరదేశములకంటె భిన్నముగా నియమమేర్పడియున్నది. దాయాధికారము స్త్రీపరంపరవారిది గానిపురుషపరంపరవారిది గాదు. ఒకపురుషుని పుత్రులు ఉత్తరాధికార పరంపరలోనివారు గారు. పురుషుని ద్రవ్యము వానిభగినులకును భాగినేయులకును భగినీపుత్రికలకునుభగినీపుత్రికలకొడుకు గూఁతులకును దల్లికినిఁ దల్లిభగినులకును వారిబిడ్డలకును మఱియు వానియొక్క మాతామహికిని దానిభగినులకును వారిబిడ్డలకును జేరును. ఇట్టి దాయాద పరంపరలేని పక్షమందిరాజధానిక్రింద తక్కిన దేశములవలెఁ బురుషునియొక్క శిష్యునకును సతీర్థ్యునికిని రాజునకును వరుసగాఁ జేరును.

స్త్రీపరంపరకు దాయాధికారము।

౩౮౩. స్త్రీపరంపరయందు వచ్చెడు దాయనియమము మరుమక్క దాయమనఁబడును. మళయాళదేశమునకు మొదటిరాజయినపరశురాముఁడా దేశమందు బ్రాహ్మణులను జేర్చి వారికివృత్తు లేర్పఱిచి యవివిభక్తములై చెడకుండునట్లు జ్యేష్ఠపుత్రులే యావృత్తులు పొందవలసినవారనియు వారు మాత్రమువివాహము చేసికోవలసిన వారనియు నియమమేర్పఱిచినాఁడని చెప్పుదురు. వీరియొక్క పుత్రులు కుటుంబము వారందఱికి సంతతివారుగా గణింపఁబడుదురు.. తమ్ములుభా

ఈనియమమునకు మూలము।

ర్యాహీనులుకాఁబట్టి వారికిఁదక్కువజాతిస్త్రీలతో సంసర్గ
మనుజ్ఞాతమైయున్నది. ఇట్లుసంసర్గముచేతఁ గలిగినసంతతి
వారువివాహితునకుఁబుట్టినవారుకారుకాఁబట్టివీరికిబ్రాహ్మ
ణ్యమునుదండ్రిదాయముపొందునధికారమును లేకపోయినవి.
ఇందుచేతనే వీరికిమాతృదాయమేవచ్చును. తక్కువజాతుల
వారుతమలోఁదామిట్టిసంకీర్ణసంసర్గనియమమునకేలోపడిరి.
వీరిలోసమర్తాడని స్త్రీలకొకవిధమైన వివాహము కలదుగా
ని వరునికి నియతముగా భర్తృత్వాధికారము లేదు. సమర్తా
డిన యనంతరమాస్త్రీలు తమకిచ్చవచ్చినవా రెందఱితోఁ
గాని సంసర్గింపవచ్చును. ఇట్టిసంసర్గము సవర్ణులతోఁగాని
యుత్తమవర్ణులతోగాని చేయవలసినది. ఇట్టిసంసర్గముచేతఁ
గలిగిన సంతతివారికిఁ దండ్రి యీజాతివాఁడని యేర్పడక
యుండుటవలనఁ దల్లులయొక్క దాయమందే సంబంధము
గలిగియుండును.

అనియమము నకు లోపడిన జాతులు।

౩౮౪. మరుమక్కదాయ నియమమును సకలవర్ణముల
వారాచరించెదరు. బ్రాహ్మణులకును గుడియ్యాడిగములయి
న యహప్పాదు వాళులకును వడ్ల, కంచర, కమ్మర, కంసాల
వాండ్రకును, చరుములు, మలయరు, పాణరుమొదలైన యి
ట్టికొన్నితక్కువజాతులవారికినిమాత్రమా నియమము లేదు.
వీరు పురుషపరంపరయందు దాయస్వత్వము గలవారు. ఉ
త్తర మళయాళమందలి తీయరను పర్యాయ నామముగల
యీండ్రులును ముక్కవలను పర్యాయనామముగల బెస్తలు
ను మరుమక్క దాయముగలవారు. అక్కడి దక్షిణప్రాంత

మువారు మక్కదాయ నియమముగలవారు. మక్కదాయ మనఁగాఁ బురుషపరంపరయందు దాయస్వత్వము. ఉత్తర మళయాళమందు బహుతరముగా మాప్లాజాతివారందఱు తురకలయ్యును మరుమక్కదాయ నియమమాచరించెదరు. ఈయాచారము హిందువుల యేలుబడి కాలమందు వీరికిఁగలిగినది.

౩౮౫. ఈమరుమక్కదాయ మాచరించు కుటుంబములనేకములు చేరియేకకుటుంబమైయుండును. ఈకుటుంబము తర్వాడీయనఁబడును. దూరస్థుఁడు సహితము కుటుంబజ్యేష్ఠునకులోపడి తత్కుటుంబము వారితోఁగూడి కర్మానుష్ఠానము చేయువాఁడాకుటుంబములోనివాఁడని యెంచఁబడును. ఏవంశశాఖవాఁడుగాని వయసుచెల్లినవాఁడు కుటుంబజ్యేష్ఠుఁడు. వీఁడు కారనవనని చెప్పఁబడును. కుటుంబములోని తక్కినవారనంతర వరులనఁబడుదురు.

కుటుంబములసంఘము।

౩౮౬. గతించిన కారనవనునియొక్క యధికారమువానితరవాడీవారిబంధువులలో వయసుచెల్లినవానికి వచ్చును గాని సమీపబంధువులకురాదు. దీనికుదాహరణము. తల్లియొక్క భాగినేయునికంటె జ్యేష్ఠుఁడయిన తల్లియొక్కభగినీదౌహిత్రునకుముందు దాయాధికారము వచ్చును. (కల్లికోట సబ్ కోర్టు ౧౮౪౩ అ. నం. ౩౯లో తీర్పు) తనభాగినేయుఁడు తల్లిభాగినేయునికంటె సమీపబంధువయినను వానికిరానేరదు.

కారనవనుని యధికార స్వత్వము।

౩౮౭. కుటుంబజ్యేష్ఠునకుఁగుటుంబ కార్యములయందు

భాగమడుగఁ

గూడదు।

ను కుటుంబద్రవ్యమందును సర్వాధికారము కలదు. అందఱి మేలుకొఱకు వాఁడు కార్యము చూడవలసినది. కుటుంబములో నెవ్వఁడైనను దనభాగముకై వివాదపడి భాగమిమ్మని బలాత్కరించుటచేతఁగాని తానప్పుపడియా యప్పుద్రవ్యము మీఁదఁజాటుటచేతఁగాని కుటుంబముయొక్క కూడిక చెడనేరదు. (స. కో. ౧౮౧౪ రి. అ. నం. ౨౮లో తీర్పు; మళయాళము జి. కో. ౧౮౮౨ స్పె. అ. నం. ౧లోతీర్పు; కల్లికోట సి. కో. ౧౮౪౮ అ. నం. ౩౬లో తీర్పు; స. కో. ప్రొ. ౧౮౫౪ ఫిబ్రవరి ౧౩)

సమ్మతిచేత విభాగముగలుగవచ్చును।

౩౮౮. ధర్మస్థానమందు వ్యవహారము తెచ్చుటచేతనైనను (స. కో. ౧౮౫౭ స్పె. అ. నం. ౪లో తీర్పు) ఋణమిచ్చినవాఁడు తగవు తెచ్చుటచేతనైనను విభాగము కలుగనేరదుగాని కుటుంబములోనివారు పరస్పరసమ్మతిచేత విభాగము చేసికోవచ్చును. ఆవిభాగము ధర్మస్థానమువా రొప్పుకొందురు. అట్టివిభాగ విషయమందొకనికి హానిప్రాప్తించుపక్షమందు ధర్మస్థానమువారు దానిని నిస్సందేహముగా మాన్పుదురు.

విభాగమున కుఁగారణము।

౩౮౯. అట్టివిభాగము తావళీలను కుటుంబశాఖలకను రూపముగాఁ గుటుంబకూటస్థుని భగినులయొక్క సంఖ్యానురూపముగా మొదటవిభాగమేర్పడవలసినది. వీరికివచ్చిన విభాగము కుటుంబశాఖలవారికివచ్చి పిమ్మట వారిసంతతివారికేవచ్చును.

కారనవను యొక్క విని

౩౯౦. కారనవను తనపూర్వులదిగాని స్వార్జితముగాని జంగమద్రవ్యము తనయుక్తానుసారముగా వినియోగింపవ

చ్చును. పూర్వార్జితముగాని స్వార్జితముగాని స్థావరద్రవ్య ము వినియోగించుపక్షమం దనంతరవరులలో ముఖ్యులయిన వారియొక్క లిఖితపురస్సరమయినసమ్మతి కావలసినది. (ప. ఖం. ప్రా. కో. ౧౮౩౯ రి. అ. నం. ౨౭లో తీర్పు; మళయాళ ము జి. కో. ౧౮౪౦ స్పె. అ. నం. ౨౯లో తీర్పు; స. కో. ౧౮౪౫ రి. అ. నం. ౫లో తీర్పు)

యోగాధి కారము।

౩౯౧. కారనవనుతో విరోధించినయొకయనంతరవను యొక్క సమ్మతిలేమి కారనవనుచేయుస్థావరద్రవ్యవినియో గమునకుఁ బ్రతిబంధకముగా నేరదు. ఇట్టి వినియోగమునక నంతరవరులసమ్మతి కావలెనని ముందుచెప్పినవిధివాక్యమం దుఁగుటుంబమందనుకూలించి కూడియున్న యనంతరవరుల సమ్మతి కావలసినదని తాత్పర్యము. (మళయాళము జి. కో. ౧౮౪౦ స్పె. అ. నం. ౨౯లో తీర్పు)

౩౯౨. అనంతరవరుల యనుమతిలేకయేకుటుంబకార్య ముకై సొమ్ముతాకట్టుపెట్టి కారనవను ఋణము తీయవచ్చు ను. బొత్తిగా సొమ్మువినియోగించువిషయమందనంతరవరు లసమ్మతికావలసినది. (స. కో. ౧౮౪౫ రి.అ.నం. ౫లో తీర్పు)

అప్పుచేయు టకు—

౩౯౩. కారనవను వ్రాసి యిచ్చుపత్రముల చెల్లుబడిక యి యనంతరవరుల చేవ్రాలుకావలెనని యక్కఱలేదు. (స. కో. ౧౮౪౬ రి. అ. నం. ౪౧లో తీర్పు; ౧౮౫౨ స్పె. అ. నం. ౩౮లో తీర్పు)

౩౯౪. కారనవనుగాని వానియనుమతిచేతఁ గార్యము లు చూచుకుటుంబము లోనివాఁడుగాని కుటుంబమునకుఁగా

కుటుంబద్ర వ్యమీఁ దగుట।

వలసి చేసిన ఋణములకుఁ గుటుంబద్రవ్యమీఁదవును. కుటుంబములోనివాఁడు ప్రత్యేకముగాఁ జేసికొన్న ఋణమునకుఁ గుటుంబద్రవ్యమీఁదుగాదు. కల్లికోట సి. కో. ౧౮౪౮ అ. నం. ౩౬లో తీర్పు; స. కో. ౧౮౫౭ స్పె. అ. నం. ౩౮లో తీర్పు; ౧౮౫౪ స్పె. అ. నం. ౪౮, ౪౯లో తీర్పులు)

౩౯౫. కుటుంబజ్యేష్ఠుఁడు స్వకార్యముకయి చేసికొన్న ఋణమునకుఁగుటుంబద్రవ్యమీఁదుగాదు. (స. కో. ౧౮౪౪ రి. అ. నం. ౩ ౭లో తీర్పు)

౩౯౬. కుటుంబమందు వాఁడువాఁడు ప్రత్యేకముగాఁ జేసికొన్న ఋణములకుఁ గుటుంబద్రవ్యములోని తమతమ యంశమీఁదుగాదు. (స. కో. ప్రొ. ౧౮౫౦ ఆగస్టు ౫)

౩౯౭. కారనవనుతీసిన ఋణముకుటుంబకార్యమునకుఁ గాదని రుజువుగానిపక్షమందా ద్రవ్యము కుటుంబకార్యముకైతీసినదని యెంచవలసినది. అనంతరవను తీసిన ఋణము స్వకార్యముకయి చేసినదేయని యెంచవలసినది. స్వకార్యమునకుఁదీసినదికాదని రుజువయినపక్షమందు దానికిఁగుటుంబద్రవ్యమీఁదగును.

కారనవను వారింపఁబడుట।

౩౯౮. యోగ్యుఁడుకాని కారనవనువారింపఁబడవచ్చును. (కల్లికోట సి. కో. ౧౮౪౮ అ. నం. ౩౬లో తీర్పు) కారనవను యోగ్యుఁడుకాఁడనుటకు జాతిభ్రంశము వార్ధకము చెవిటితనము గుడ్డితనము మూఁగతనము వెఱ్ఱితనము నీచవర్తనము కుటుంబద్రవ్యము చెఱుచుటయు నిమిత్తములు. కారనవను స్వకుటుంబమువారి చేతఁగాని ధర్మస్థానమువారి చే

తఁగాని వారింపఁబడినప్పుడు వయసుచేత వానికి రెండవవాఁ డై యోగ్యుఁడైనవానికి వానియధికారమువచ్చును.

౩౯౯. కుటుంబద్రవ్య సాహాయ్యము లేక స్వప్రయత్నముచేత సంపాదించిన జంగమద్రవ్యము సంపాదించినవానికే చేరి వానియిష్ట వినియోగమున కర్హమైయుండును. పురుషులవలెనే స్త్రీలు సహితము స్వార్జితద్రవ్యముపొందవచ్చును. పురుషుల స్వార్జితద్రవ్యము తమకు వెనుకఁదమభాగినేయులకుఁగాని సమీపస్థులయిన యనంతరవరులకుఁగాని చేరును. (కల్లికోట సబ్ కోర్టు ౧౮౫౭ అ. నం. ౩౭౦ లో తీర్పు) స్త్రీలయొక్క స్వార్జితము తమపుత్రులకుఁ బుత్రికలకుఁ జేరును.

స్వార్జితద్రవ్యము।

౪౦౦. ఇతరదేశములోని స్త్రీలవలెవీరికి వైధవ్యదశ లేదు. స్త్రీలుపురుషులతో సంసర్గముకలిగికాని లేకకాని తమ కుటుంబమునందే వసించెదరు.

వైధవ్యదశ।

౪౦౧. శాస్త్రముచొప్పున స్త్రీలకే ద్రవ్యము చేరవలసినది. పురుషులు కుటుంబకార్యములు నడపుకొనితమజీవనాంశమునుగుకొనుట కధికారముగలవారు. పురుషులకు స్త్రీలతో సరిపాలాచారమందుఁ గలిగియున్నది. పురుషులులేని పక్షమందు స్త్రీలు సముదాయ ద్రవ్యముంచుకొని కుటుంబ కార్యములు నడపెదరు. కొన్నికుటుంబములయందుఁ గుటుంబ విచారణ స్త్రీలకుఁగాని పురుషులకులేదు. ఈవిషయమునందుఁ గుటుంబజ్యేష్ఠురాలికా యధికారము.

స్త్రీలుసముదాయ ద్రవ్యముంచు కొని కుటుంబము నిర్వహించుట।

భరణము। ౪౦౨. కుటుంబములోని దూరస్థులు మొదలయిన యెల్ల వారును భరణమునకుఁ బాత్రులయియుందురు.

అపత్య స్వీకారము। ౪౦౩. తోడఁబుట్టినదానికిఁ బుత్రసంతతిగాని పుత్రికా సంతతిగాని లేనిపక్షమందుఁ గుటుంబమందు జ్యేష్ఠురాలుగాని జ్యేష్ఠుఁడుగాని స్వీకారము చేయవచ్చును. పారంపర్యస్వత్వము స్త్రీపరంపరదికాఁబట్టి పుత్రికాస్వీకారము చేయవలసినది. ఇట్లు స్వీకృతురాలికిఁ గలుగఁగల పుత్రులకుఁ గుటుంబవిచారణాధికారము వచ్చునప్పటికి బాల్యదశయుండవచ్చునను సంభావనచేత భావికాలమందుఁ గుటుంబకార్యములు నిర్వహించుటకును గర్మములు నడుపుటకును స్వీకృతురాలితోడనే వానిసోదరుని సహితముస్వీకరింపవచ్చును.

కనరా దేశమందళియసంతానవిధి యొక్కచెల్లుబడి। ౪౦౪. మరుమక్కదాయవిధికి సమానమై యళియసంతానమనువిధి కనరాదేశమం దేర్పడియున్నది. మళయాళదేశమందు మరుమక్కదాయవిధివలెనే కనరాదేశమందళియసంతానవిధి సహితము బ్రాహ్మణులాచరింపరు. అళియసంతానవిధియొక్కవివరణము మరుమక్కదాయవిధి వివరణమునకు సమానము. దాయభాగస్వత్వముపురుషులకంటె స్త్రీలకువచ్చుట శ్లాఘ్యమనువిధి కనరాదేశమందుఁ దప్పకయాచరింపఁబడును. ఈదేశమందుఁ గుటుంబద్రవ్యవిచారణాధికారము సాధారణముగా స్త్రీలకుఁగలిగియున్నది. మళయాళదేశమందాయధికారము పురుషులకు సాధారణముగాఁగలిగియున్నది.

## ౧౪. ప్రకరణము.

### క్రయవిక్రయాదివ్యవహారము.

౪౦౫. బాలుఁడు వెఱ్ఱివాఁడు వివేకశూన్యుఁడు మత్తత చేతఁగాని కష్టవ్యాధిచేఁతగాని వార్ధకముచేతఁగాని కామ క్రోధభయ ఖేదాదులచేతఁగాని శక్తుఁడుగాని వాఁడునుజే యువ్యవహారముచెల్ల నేరదు. వెఱ్ఱివానికి జ్ఞానముగలిగినకా లమందుఁజేయువ్యవహారము చెల్లును. (౧. ౨౭౧, ౨౭౨)

క్రయవిక్రయాదివ్యవహారమునకుఁ దగనివారు।

౪౦౬. బలాత్కారముచేతఁగాని కపటముచేతఁ గాని చేసినవ్యవహారము చెల్లదు. అబుద్ధిపూర్వకముగాఁ జేసిన దియుఁజెల్ల నేరదు. (౧. ౨౭౩)

బలాత్కారము చేతఁగాని కపటముచేతఁగానిచేయు విక్రయాదులు।

౪౦౭. క్రయవిక్రయాదివ్యవహారము శాస్త్రమున క నుకూలించి యుండవలసినది. కానిపక్షమందుఁజెల్లదు. న్యా యవిరుద్ధముగా నిచ్చినదిమరలరాఁబట్టుకొనవచ్చును. (౧. ౨౭౪, ౨౭౫)

న్యాయవిరుద్ధముగాఁ జేసిన—

౪౦౮. క్రయవిక్రయాదులకు లేఖ్యముకావలసిన య క్కఱలేదు. (౧. ౨౭౭) అయినను లేఖ్యపురస్సరముగానుం డవలసిన వ్యవహారవిషయమందు నోటిసాక్షిచేత నేవ్యవ హారముదీర్చుటకు ధర్మస్థానమువారు సంశయింతురు.

క్రయవిక్రయాదులకు లేఖ్యమక్కఱలేదు।

౪౦౯. లేఖ్యపురస్సరమయి కలిగినక్రయాదికముత్రో పుడుపడుటచేతఁగాని విశుద్ధిపత్రముచేతఁగాని తీఱిపోవలసి నది. (స. కో. ౧౮౫౫ స్పె. అ. నం. ౧౨౭లోనితీర్పు)

క్రయపత్రాదికముత్రోపుడుపడుట।

వాఙ్మూలము పత్రనిబంధనలయందు జెల్లమి।

౪౧౦. పత్రమందుఁ జెప్పఁబడిననిబంధనలకు విరుద్ధముగాఁజెప్పెడుసాక్ష్యము సమ్మతికెక్కఁదు. పత్రమందుఁజెప్పిన ద్రవ్యము దానియందుఁ జెప్పఁబడినవానికంటెనితరునకుఁ జేరవలయునని చెప్పినసాక్ష్యము చెల్లదు. (స. కో. ౧౮౬౦ స్పె. అ. నం. ౪౯లో తీర్పు)

౪౧౧. అక్ష్లేవిక్రయపత్రమందుఁజెప్పఁబడినవానికంటె నితరునికిఁబుట్టినదని చెప్పెడు సాక్ష్యము చెల్లదు. (స. కో. ౧౮౫౮ స్పె. అ. నం. ౨౬; ౧౮౫౯ స్పె. అ. నం. ౨౩లో తీర్పులు)

ఒడఁబాటు లాభము లేకుండినను జెల్లింపవలసినది।

౪౧౨. ఒకనికొక కార్యము చేయుటకు న్యాయముచొప్పనఁబూనుకొన్నవాఁడు దానిని నెఱవేర్పుటయందుఁ దనకొక లాభము కలుగునను నమ్మకము లేకపోయినను దనయందుంచిననమ్మకమునకుఁ దగినట్లా కార్యమవశ్యము నెఱవేర్పవలసినది. (౧. ౨౮౪, ౨౮౫)

తనవశమందుంచుకొన్న సరకులకైపూఁటకాఁపు తనము।

౪౧౩. ఉపనిక్షేపముమీఁదుగాని ఋణమునకుమాఱుగాఁగాని తాకట్టుమీఁదఁగాని వేతనముకై కాని యెగుమతికయికాని తీసినసరకులను దీసినవాఁడు కాపాడుటకుఁ బూఁటకాఁపయి యుండవలసినది. ఆసరకులు పదిలపఱుచుటకును వానికివచ్చుహాని వారించుటకును బూఁటకాఁపయి యుఁడవలసినది. స్వాభావికముగాఁగాని దైవికముగాఁగాని చోరకృతముగాఁగాని ప్రాప్తించిననష్టికిఁ బూటఁకాఁపు కానేరఁడు. (౧. ౨౮౨, ౨౮౩, ౨౮౬, ౨౯౨, ౨౯౪, ౨౯౫)

గడువుమీఱి

౪౧౪. సరకులొప్పగింపుమనియడిగిన వెనుకఁగాని యొ

ప్పగింపవలసిన గడువునకు వెనుకఁగాని యొప్పగింపకనిలుపు కొన్నప్పుడు సరకులకువచ్చిన యెట్టినష్టిగాని కట్టియ్యవలసినది. (౧. ౨౮౪, ౨౮౭)

యుంచు కొన్నసరకులకై-

౪౧౫. వెలపుచ్చుకొన్న వెనుకసరకొప్పగింపనిపక్షమందుసరకునకువచ్చినహాని విక్రయించినవాఁడొప్పుకొనవలసినది. (౧. ౩౦౩)

విక్రయించినసరకులకై-

౪౧౬. వెలదీర్చుకొన్నవాఁడు సరకొప్పగించుకొనిపక్షమందువానితోఁజేసినయొడఁబాటు మానుకొని విక్రేత మరలవిక్రయింపవచ్చును. ప్రాప్తించిననష్టి మొదట వెలదీర్చుకొన్నవానిని జెందును. (౧. ౩౦౩) అయినను మరలవిక్రయింపవలసివచ్చినప్పుడు విక్రయించువాఁడు కాలవిలంబము చేయక సరియయిన వెలవచ్చుటకు వలయుప్రయత్నముచేయవలసినది.

౪౧౭. వెలదీర్చుకొని సంచకరము మాత్రమిచ్చినవాఁడొడఁబాటు తప్పిపోయినపక్షమందిచ్చిన సంచకరమువిడిచిపెట్టవలసినది. ఒడఁబాటుదప్పుట విక్రయించినవానిదయినపక్షమందు వాఁడుపుచ్చుకొన్నసంచకరము రెట్టిగానియ్యవలసినది. (౧. ౩౦౩)

సంచకరము।

౪౧౮. ఇంతకాలములోపల వారివారిస్వాతంత్ర్యములకుఁదగవు తెచ్చుకొనవలెనని యేర్పడినహిందూకాలవ్యవధి నిబంధనలను బ్రిటిష్ దొరతనమువారు మార్చిరి. (౧౮౫౯ శాసనము ౧౪)

కాలనియమము।

గుత్తకుఁదీసిన నేలయందుఁగట్టడపు వస్తువులువిప్పి కొనుట।

౪౧౯. బాడిగకుఁబుచ్చుకొన్నభూమియందుఁగాని తా కట్టించుకొన్నభూమియందుఁగాని యిల్లుగట్టుకొన్నవాఁడు గడువుతీఱిన వెనుక దానికట్టడపు వస్తువులువిప్పుకొనిపోవచ్చును. (౧. ౨౯౪)

పూఁటకాఁపుల యొక్క యుత్తర వాదము।

౪౨౦. చూపుడు పూఁటకుఁగాని నమ్మిక పూఁటకుగాని పూనుకొన్నవారు తామేయుత్తరవాదము చేయవలసినవారు. వారుగతించిన వెనుక వారిపుత్రులుత్తరవాదులుగారు. తల్లిదండ్రులు తమపూఁటపఃటకీఁడు పెట్టుకొన్నపక్షమందుఁ బుత్రులుత్తరవాదులగుదురు. (౧. ౩౦౧)

౪౨౧. అనేకులుకూడి యరువుపూఁటపడిన పక్షమదుఁ బూఁటపడినద్రవ్యమందుఁ దమదమకేర్పడినభాగముకొలఁదినుత్తరవాదముచేయవలసినవారు. ఒడఁబాటు మఱియొకరీతినున్నపక్షమందు దానిచొప్పున నుత్తరవాదము చేయవలసినవారు. (౧. ౩౦౧)

---

ముగిసెను.